# చందమామ

సంపుటి 102 మార్చ్ 2000 సంచిక 3



## ఈ సంచికలో...

### కథలు



### జానపద సీరియల్



### పౌరాణిక సీరియల్



### చారిత్రక విశేషాలు



### శీర్షికలు



### ఈ నెల విశేషాలు



ఒంటికొమ్ము రాక్షసుడి పెళ్ళి (బేతాళ కథ)



మంచితనం- మంచిధనం



అడవిలో తోడు

పాల్గొనండి బహుమతులు గెలుచుకోండి






Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, Chandamama Buildings, Vadapalani, Chennai–600 026. Editor: Viswam

దూర తీరాల్లో వున్న

మీ వాళ్ళ కోసం

ముచ్చటగా ఇవ్వతగ్గ

ఏకైక బహుమతి!



# చందమామ

వారి భాషలో
వారితో మాట్లాడే
చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతి, హిందీ, కన్నడ, మలయాళం, మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

అక్కడెక్కడో దూరంగా వున్న మీ వాళ్లకి
చందమామ వెన్నెల చల్లదనం కబుర్లు పంపండిక!

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు

పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా

పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారాగాని చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది చిరునామాకు పంపండి.

PUBLICATION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
CHANDAMAMA BUILDINGS, VADAPALANI, CHENNAI-600 026


సంపాదకుడు
విశ్వం
డిజైన్ & సాంకేతిక
సలహాదారుడు
ఉత్తమ్

ప్రధాన కార్యాలయం

చందమామ బిల్డింగ్స్
వడపళని, చెన్నయ్-600 026
ఫోన్: 4841778, ఫ్యాక్స్: 4835298

ఇతర కార్యాలయాలు

భువనేశ్వర్
116-బి, బి.డి.ఎ, డ్యూప్లెక్స్ హౌస్,
బారముండ, భువనేశ్వర్-751 003
ఒరిస్సా. ఫోన్:455 0534

ఢిల్లీ
ఫ్లాట్ నం. 415, 4 ఫ్లోర్
ప్రతాప్ భవన్
5, బహదుర్‌షా జఫర్ మార్గ్
ఢిల్లీ-110 002 ఫోన్:3353406/7

ముంబాయి
2/B నాజ్ బిల్డింగ్స్,
లామింగ్‌టన్ రోడ్,
ముంబాయి-400 004
ఫోన్:3889763-3886324-3877110
ఫ్యాక్స్:3889670


అమెరికాలో
విడి కాపీ
$2
సంవత్సర చందా
$20



సంచాలకులు:
చక్రపాణి, బి. నాగిరెడ్డి

# అర్హులకు ఓటివ్వడం ఎలా?

ఈ సంచిక అచ్చయ్యే సమయానికి మనదేశంలోని కొన్ని రాష్ట్రాలలో ఎన్నికల కారణంగా వాతావరణం వేడెక్కి, ఉద్వేగభరితంగా మారుతుంది.

అయితే, ఎన్నికల సమయంలో కావలసింది ఉద్వేగం కాదు; ఆవేశం కాదు. నింపాదిగా ఆలోచించి, నిదానంగా నిర్ణయం తీసుకోవడం. ఎందుకంటే, ఆ నిర్ణయంమీదే దేశ భవిష్యత్తు ఆధారపడి వుంటుంది.

వయోజన ఓటుహక్కు పద్దెనిమిది సంవత్సరాలకు తగ్గించడంతో, మన యువపాఠకులు చాలామంది ఓటర్లయ్యారు. కులమత భేదాలు పాటించకుండా మంచివాళ్ళకే ఓటివ్వాలని పెద్దలు చెబుతారు. ఇది అక్షరాలా నిజం. అయితే, సమస్య అదొక్కటే కాదు. ఇవాళ మంచివాళ్ళు చాలామంది ఎన్నికల జోలికే వెళ్ళడం లేదు. ఎన్నికలలో పోటీచేయకపోవడం సరేసరి; కనీసం ఓటు వేయడానికి కూడా వెళ్ళరు. ఓటింగు కేంద్రానికి వెళ్ళిరావడానికి కొందరు భయపడతారు. మరికొందరు — ఎవరు అధికారంలోకి వస్తే మనకేం అనే అమాయకమైన నిర్లిప్తత కొద్దీ ఇంటిపట్టునే ఉండిపోతారు!

అందరూ ఓటు వేయాలంటే ఎన్నికలు ప్రశాంతంగా జరగాలి. అభ్యర్థులు వచ్చి ప్రజలను ఓటివ్వమని కాళ్ళా వేళ్ళాపడి బతిమలాడే కాలం పోయి, ప్రజలే వెళ్ళి అర్హులైన మంచివారిని అభ్యర్థులుగా నిలబెట్టి, ఓటిచ్చే మంచి కాలం రావాలి!

స్పష్టమైన రాజకీయ అవగాహన; ఆరోగ్యవంతమైన సామాజిక సంస్కృతి రూపుదిద్దుకున్నప్పుడే అది సాధ్యం. ఆ మంచికాలం కోసం మనమందరం కృషి చేయాలి!

# చందమామ కబుర్లు

## జేబులో భూతం!

జేబులోవున్న సిగరెట్ ప్యాకెట్ ప్రాణాలుతీసే బుల్లిభూతానికి సమానం. ఒక సిగరెట్ కాలిస్తే ఆ మనిషి అయువులో పదకొండు నిమిషాలు తగ్గిపోతాయని చెబుతారు. ఇరవై సిగరెట్లున్న ఒక ప్యాకెట్‌సిగరెట్లు కాలిస్తే ఆ వ్యక్తి ఆయుస్సులో మూడు గంటలా నలభై నిమిషాలను హరిం చేస్తుందని ఒక అంచనా.

1999 నవంబర్‌లో కట్టిన అంచనా ప్రకారం, ప్రపంచం మొత్తం మీద 1.2 కోట్లు పొగ పీల్చే



వాళ్ళు ఉండేవాళ్ళు. సంవత్సరాంతానికి వాళ్ళల్లో నలభై లక్షలమంది పొగ సంబంధమైన వ్యాధులతో ప్రాణాలు కోల్పోయి ఉంటారు.

## ఆయుస్సును పెంచే నవ్వు!

పొగ మనిషిని చంపినట్టే, నవ్వు మనిషి ఆయుః ప్రమాణాన్ని పెంచుతుంది. దీనిని నిరూపించడానికి సరైన దాఖలాలులేవుగాని, ఈ అభిప్రాయం ప్రపంచమంతటా వ్యాపించివుంది. ఏది ఏమైనా నవ్వు జీవితాన్ని సుఖమయం చేసి, ఆనందాన్ని కలిగిస్తుంది. ప్రపంచ వ్యాప్తంగా




వున్న, ఐదు వందల 'నవ్వుల క్లబ్బులు' జనవరి 9వ తేదీ 'ప్రపంచ నవ్వుల దినం' జరుపుకున్నాయి!

## విశ్వమంతా ఒక ఇల్లు!

మనలో చాలా మందికి మనం ఉంటూన్న ఇల్లే ప్రపంచం! తాము నివసిస్తూన్న గ్రామాన్నీ, పట్టణాన్నీ తమ ఇల్లుగా భావించే వాళ్ళూ ఉన్నారు. దేశభక్తులకు పుట్టినదేశమే ఇల్లు. 'జగమంతా మన ఊరు; జనులందరు మన వాళ్ళే' అని 'వసుధైక కుటుంబ' ఆదర్శాన్ని



ప్రబోధించిన పెద్దలూ ఉన్నారు. మన ఊహా పరిధిని మరింత పెంచినట్టయితే, భూగోళం పరిభ్రమిస్తూన్న మన సూర్యమండలమంతా, అంటే —విశ్వమంతా ఒకే ఇల్లు అనే భావన కలుగుతుంది!

# ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

# దారాషుకో

మొగల్ చక్రవర్తి షాజహానుకూ, ముంతాజ్‌బేగంకూ కొడుకు పుట్టడం గొప్ప ఆనందకరమైన విషయమే కదా! అది 1615వ సం॥ మార్చ్ 20వ తేదీ. రాజభవన మంతా ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి.

యువరాజు, దారాషుకో పేరుతో పెరిగి వివేక వంతుడైన యువకుడయ్యాడు. ఆయన అందరిపట్లా గౌరవాదరాలతో నడుచుకునేవాడు. అందరిలా ఆడంబరాల జోలికి పోకుండా, కాలం వృథాచేయ కుండా ఎప్పుడూ చదువుతూ, ఆలోచిస్తూ గడిపేవాడు. ముఖ్యంగా వేదాలు, ఉపనిషత్తుల పట్ల ఆకర్షితుడై వాటిని నిరంతరం అధ్యయనం చేసేవాడు. పండితులనూ, విద్వాంసులనూ రాజభవనానికి రప్పించి, వారితో తాత్విక, ఆధ్యాత్మిక విషయాలను గురించి రోజుల తరబడి చర్చించేవాడు.



ఆయన ఉపనిషత్తులనూ, భగవద్గీతనూ పర్షియన్ భాషలోకి అనువదించాడు. జీవితంలో ఆధ్యాత్మిక పరమార్థానికి సంబంధించినంత వరకు — హిందూ, ముస్లిం మతాల మధ్య మౌలికంగా భేదాలు లేవని ఆయన భావించాడు. ఉభయ మతాల మధ్యవున్న సామ్యాలను నిరూపిస్తూ ఆయన 'సముద్రసంగమ' అనే గ్రంథాన్ని రచించాడు.

యువరాజు దారా అమూల్యమైన ఆధ్యాత్మిక విషయాల పట్ల ఆకర్షితుడై నిరాడంబర జీవితం సాగిస్తూంటే — ఆయన తమ్ముడు ఔరంగజేబు రాజ్యసింహాసనానికై కుట్రపన్నసాగాడు. షాజహాన్ ఆరోగ్యం దెబ్బతినడం ఔరంగజేబుకు అవకాశంగా పరిణమించింది. ఆ తర్వాత జరిగిన యుద్ధంలో అతడు దారాను ఓడించాడు. దారా పారిపోయి, దాదర్ గవర్నర్ జివాన్‌ఖాన్ ఇంట తలదాచుకున్నాడు. అంతకు పూర్వం ఒకప్పుడు దారా, జివాన్‌ఖాన్ ప్రాణాలను రక్షించాడు. అయితే ఆ కృతజ్ఞతను కూడా చూపకుండా ఆ రాజద్రోహి దారాను ఔరంగజేబుకు అప్పగించాడు. క్రూరస్వభావుడైన ఔరంగజేబు—సింహాసనానికి వారసుడూ, సాత్విక స్వభావుడూ అయిన అన్న దారాషుకోను బంధించి ఢిల్లీ నగర వీధులలో దారుణంగా తిప్పాడు. 1659వ సం॥ ఆగస్ట్ 30యవ తేదీ దారా హతమార్చబడ్డాడు. ఆయన కుమారుడు సులైమాన్ 1662వసం॥లో జైలులో చంపబడ్డాడు. ఔరంగజేబు రాజ్యకాంక్షతో మురాద్, షుజా అనే మరిద్దరు సోదరులను కూడా చంపాడు!

## దారాషుకో సూక్తులు:

దేవుణ్ణి ఈలోకంలో కాకుండా పరలోకంలోనే గ్రహించగలము, పొందగలము అన్న అభిప్రాయం హేతుబద్ధమైనదికాదు. ఎందుకంటే-భగవంతుడు సర్వశక్తి సంపన్నుడు అయినప్పుడు, ఆయన ఎక్కడకావాలన్నా, ఎప్పుడు కావాలన్నా, ఎలా కావాలన్నాసాక్షాత్కరించగలడు. ఇక్కడ ( ఈలోకంలో ) దేవుణ్ణి గ్రహించలేని వారు, అక్కడ ( పరలోకంలో ) గ్రహించడం కూడా చాలా కష్టమే!

సాక్షాత్తు విష్ణు అంశ అయిన నా ఆత్మ అభీష్టాను సారం, నా మనసును మందరగిరి (కవ్వం)గా చేసి, విశ్వాసం — అవిశ్వాసం అనే దేవదానవులతో మత గ్రంథాలను మథించాను. వాటి నుంచి అమూల్యమైన జ్ఞానరత్నాన్ని పొందాను. సముద్రాలను మథించి, దేవదానవులు సాధించిన పద్నాలుగు మణులకన్నా అది మహనీయమైనది!

భగవంతుడి మీది అపార భక్తివిశ్వాసాల కారణంగానే 'సముద్రసంగమ' గ్రంథాన్ని పూర్తి చేసే శక్తిని పొందాను.

# చందమామ

## ఫిబ్రవరి 2000




### సమాధానాలు

1. గోస్వామి తులసీదాసు, బిల్వమంగళుడు.
2. ఎ. బలరాముడు అభిమన్యుడి మేనమామ.
   బి. ఉగ్రసేనుడు ప్రద్యుమ్నుడి ముత్తాత.
   సి. ఘటోత్కచుడు శిశుపాలుడి మేనల్లుడు.
   డి. పరీక్షిత్తు కీచకుడి మేనకోడలి కుమారుడు.
   ఇ. కర్ణుడు సుభద్రకు బావ.
3. 1. చరకసంహిత. చరకుడు. క్రీ.శ.1వ శతాబ్దం కనిష్కుడి కాలంలో.
   2. శుశ్రుత సంహిత. శుశ్రుతుడు. క్రీ.శ. 2వ శతాబ్దంలో.
   3. రాజతరంగిణి, కాశ్మీర రాజుల చరిత్ర. కల్హణుడు, 12వ శతాబ్దానికి చెందిన వాడు.
   4. అర్థశాస్త్రం. కౌటిల్యుడు (చాణక్యుడు). క్రీ.పూ.4-3 శతాబ్దాలకు చెందినవాడు.
   5. నాట్యశాస్త్రం. భరతముని. క్రీ.పూ. 3వ శతాబ్దం-క్రీ.శ. 1వ శతాబ్దం మధ్య కాలంలో.

# సృజనాత్మక పోటీలు

## చందమామ పాఠకులకు ఆహ్వానం

మీ ఊహాశక్తికీ, వివిధ రంగాలలో మీ సృజనాత్మక ప్రతిభకూ పదునుపెట్టే పోటీలలో పాల్గొనండి!





## ఫోటో వ్యాఖ్యల పోటీ

1. ఫోటో వ్యాఖ్యల పోటీ పేజీకి కావలసిన రెండు ఫోటోలను యువఫోటోగ్రాఫర్లు పంపవచ్చు. రెండు ఫోటోలకూ పరస్పర సంబంధం ఉండాలి. ఆ సంబంధం గురించిన సొంత వివరణ రాసి, తప్పకుండా ఆ ఫోటోలతో జతచేసి పంపాలి.

ఎంపికచేయబడే (రెండు) ఫోటోలకు
బహుమతి రూ.500/-
ఫోటోలు ఎప్పుడైనా పంపవచ్చు.



2. మీ పత్రికలో ఒక సామెతను ప్రచురిస్తాం. ఆ సామెతలోని విషయాన్ని వివరించే సంఘటనను గాని, సొంత అనుభవాన్నిగాని, లేదా (కొత్త/పాత) కథనుగాని 300 పదాలకు మించకుండా రాసి పంపాలి. మీరు పంపే రచనలో సామెతలకు సంబంధించిన విషయం ఉండాలే తప్ప, ఆ సామెత పుట్టిన కారణం తెలియజేసే అసలు కథను మాత్రం పంపకూడదు అన్న విషయం గుర్తుంచుకోండి.

ఈ నెల సామెత: "మొక్కై వంగనిది మానై వంగునా?"
ఎంపికచేయబడే రచనకు బహుమతి రూ. 500/-

మీ రచనలు మార్చ్ 31లోగా మాకు చేరాలి.
గెలుపొందిన రచన జూన్ నెల సంచికలో ప్రచురించబడుతుంది.
మీ ఎంట్రీలను ఈ చిరునామాకు పంపండి:
చందమామ సృజనాత్మక పోటీలు
చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్-600 026

—సంపాదకుడు

బేతాళ కథలు

# ఒంటికొమ్ము రాక్షసుడి పెళ్లి!

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు దేన్ని సాధించగోరి యింతగా శ్రమపడుతున్నావో తెలియడంలేదు. అయితే, ఫలితం చేతికి అందే సమయానికి నీ లక్ష్యాన్నీ, ధ్యేయాన్నీ మరిచిపోగలవేమో అన్న అనుమానం కలుగుతున్నది. కొందరు అవివేకులు కృషి విజయవంతం అయ్యే సమయంలో వెనుకంజ వేసి, అనుకున్నది సాధించలేని



అసమర్థులవుతారు. ఇందుకు ఉదాహరణగా నీకు, స్రవంతి అనే రాకుమారి కథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

చంద్రగిరిని పాలించే చంద్రసేనుడికి మగసంతానం లేదు. పెళ్ళయిన పదిహేను సంవత్సరాలకు పుట్టిన స్రవంతిని, మగ పిల్లవాడిని పెంచినట్లే పెంచి పెద్ద చేశాడు. స్రవంతి విలువిద్యలో, గుర్రపుస్వారి, కత్తి యుద్ధాలలో ప్రావీణ్యం సంపాదించింది. వేట అంటే ఆమెకు ప్రాణం. తండ్రితో సమానంగా దట్టమైన అడవులలో క్రూర మృగాలను ఎంతో నేర్పుగా వేటాడుతూండేది. పెళ్ళీడుకు వచ్చిన కూతురు ఇలా పురుషుడిలా వేటలో పాల్గొనడం, మహారాణికి నచ్చేదికాదు. పొరుగుదేశపు రాజకుమారుడితో అనుకున్న సంబంధం ఒకటి, ఆమె ఈ ప్రవర్తన కారణంగానే తప్పిపోయింది. దీనితో మహారాణికి, కూతురి పెళ్ళి విషయం పెద్ద బెంగగా తయారైంది.

ఒకనాడు, తల్లి అనాసక్తంగా భోజనం చేస్తూండడం గమనించిన స్రవంతి, ఆమె భుజం మీద చేతులువేసి, "అమ్మా, నా పెళ్ళి గురించి దిగులుపడకు. అలా చూస్తూండు! నాన్నగారి సింహాసనానికి తగిన అర్హుణ్ణి నేనే ఎంపికచేసి తీసుకువస్తాను!" అంటూ ధైర్యం చెప్పింది.

స్రవంతికి ఎంతకాలంగానో ఒంటరిగా వేటకు వెళ్ళాలన్న కోరికవున్నది. ఒక రోజు ఆమె చీకటితోటే ఎవరికీ చెప్పకుండా పురుషుడిలా దుస్తులు ధరించి, గుర్రం మీద అడవికి బయలుదేరింది. అది కార్తీక మాసం కావడంతో, అడవి అంతా పచ్చగా, పొగమంచుతో, రంగురంగుల పుష్పాలతో మనోహరంగా వున్నది. ఆమె వేట విషయం మరిచి, ప్రకృతి అందాలను చూస్తూ, అడవిలో చాలా దూరం వెళ్ళిపోయింది.

మిట్టమధ్యాహ్నం వేళకు స్రవంతి, ఎత్తయిన రెండుకొండల మధ్య వున్న, ఒక సరోవరతీరానికి చేరుకున్నది. అలసివున్న ఆమె, సరోవరంతీరాన పచ్చికలో గుర్రాన్ని వదిలి, ఒక చెట్టు కింద విశ్రమించింది. క్రమంగా నిద్రలోకి జారబోతున్న ఆమెకు, గుర్రం సకిలించడంతో నిద్రాభంగమై కళ్ళు తెరిచింది. సరోవరంలో నీరు తాగడానికి వచ్చిన పులి ఒకటి, ఆమెకేసి వస్తున్నది.

స్రవంతి చప్పున పక్కనేవున్న విల్లు అందుకోబోయింది. అయితే, ఇంతలో

పులి పెద్దగా గాండ్రిస్తూ ఆమె మీద పడింది. ఆ సమయంలో పులి పంజాదెబ్బకు, ఆమె కుడిచేతికి గాయమయింది. ప్రాణభయంతో ఆమె కళ్ళు మూసుకున్నది. మరుక్షణం పులి పెద్దగా గాండ్రిస్తూ దభీమంటూ పక్కకు పడిన శబ్దం అయింది.

స్రవంతి చప్పున కళ్ళు తెరిచింది. గుండెల్లో బాణం దూసుకుపోవడంతో పులి నేల మీద గిలగిలాతన్నుకుంటున్నది. అంతలో అక్కడికి చేతిలో విల్లు పట్టుకుని,ఒక అందమైన యువకుడువచ్చాడు. ఆమె అతడికేసి ఆశ్చర్యంగా చూసి, ఏదో అనబోయేంతలో, చేతికి తగిలిన గాయం నుంచి రక్తం ధారగా కారడంతో స్పృహ తప్పింది.

ఆమెకు తిరిగి స్పృహవచ్చేసరికి, ఒక పర్ణశాలలోని శయ్యమీద వున్నది. కిటికీ లోంచి అందమైన జలపాతం ఒకటి కనిపిస్తున్నది. చప్పున శయ్యమీద లేచి కూర్చున్న స్రవంతి, ఎంతో నైపుణ్యంగా గాయం బాధ తెలియకుండా కట్టిన కట్టును చూసుకున్నది.

కొంచెం దూరంగా కల్వంలో ఏదో మూలికలు నూరుతున్న యువకుడు, ఆమె లేవడం చూసి, "ఒంట్లో ఎలా వున్నది? గాయం నొప్పి తగ్గిందా?" అని అడిగాడు.

స్రవంతి చేతికట్టుకేసి చూసుకుంటూ, "పులిపంజా దెబ్బ, ఏ కంఠంమీదనో పడలేదు. చేతికి చాలా పెద్దగాయమే అయినట్టుంది!" అన్నది.

"అవును! నేనిచ్చే లేపనం రోజూ పూస్తూంటే, మాసం తిరిగే సరికి మచ్చ



కూడా కనిపించదు. కాళ్ళూ, చేతులూ తెగినవాళ్ళకే కుట్లువేసి నయం చేయగల శస్త్ర చికిత్స నాది," అంటూ యువకుడు, తన రెండుచేతులూ స్రవంతికి చూపుతూ నవ్వాడు.

స్రవంతి అడగ్గా, ఆ యువకుడు తన పేరు కోదండపాణి అని చెప్పాడు. తండ్రి మంచి హస్తవాసిగల శస్త్రచికిత్సా నిపుణుడు. ఆయన మరణానంతరం కోదండపాణి వైద్యవృత్తి ద్వారా, ఆ ప్రాంతాల్లోని చెంచులకూ, కోయలకూ ఉచిత వైద్యం చేస్తున్నాడు. గాయపడిన అడవి జంతువులకు కూడా, వెనుకాడకుండా వైద్యం చేస్తూంటాడతను.

"నీగుర్రం మీదే నిన్నిక్కడికి తీసుకు వచ్చాను. నీ చేతి గాయానికి కుట్లు వేస్తున్నప్పుడు, నువ్వు పురుషవేషంలో



కోటకు తిరిగివచ్చాక, కళ్ళుమూసినా, తెరిచినా కోదండపాణే కనపడసాగాడు, స్రవంతికి. ఏ రాకుమారుడికైనా తలదన్నే అందచందాలు, ధైర్యం, పైగా అడవి జంతువులకు కూడా సేవచేసే దయా గుణం! ఆమె, అతడే తనకు కాబోయే భర్త అని నిశ్చయించుకుని, అతడి అభి ప్రాయం తెలుసుకోడానికి పక్షం రోజులు కూడా తిరగకుండా మళ్ళీ అడవిలోకి బయలుదేరింది.

ఈసారి పేదఇంటి యువతిలా వేషం మార్చింది, స్రవంతి. కోదండపాణి తనను ఆ దేశపు యువరాణీగా కాక, ఆమెను ఆమెగా ఇష్టపడి పెళ్ళికి ఒప్పుకోవాలన్నదే ఆమె ఆశ.

స్రవంతి అడవిలోని సరోవరాన్ని చేరే సరికి సాయంకాలమయింది. ఆ సమయం లో చిన్నతాటిచెట్టు ప్రమాణంలో వున్న ఒంటికొమ్మురాక్షసుడొకడు సరోవరంలో స్నానం చేస్తున్నాడు. వాణ్ణి చూస్తూనే గుండె లవిసిన స్రవంతి కెవ్వుమంటూ కేకపెట్టి, వెనక్కు తిరిగి పారిపోసాగింది.

ఆ కేక విన్న రాక్షసుడు, చప్పున నీటి నుంచి బయటికి వచ్చి, నాలుగైదంగల్లో స్రవంతిని సమీపించి, వడిసిపట్టుకుని భుజానవేసుకుని, కొండమీద వున్న తన కోటకు తీసుకుపోయి, ఒక పెద్ద గదిలో దించి, "పిల్లా, భయపడకు! నిన్ను చుట్టూ వున్న అడవి సాక్షిగా పెళ్ళాడతాను, తినే స్తాననుకునేవు!" అంటూ గదితలుపుకు బయట గొళ్ళెం పెట్టి, ఎటోవెళ్ళిపోయాడు.

వున్న ఆడపిల్లవని గ్రహించాను. ఇంతకూ, ఈ పురుషవేషం ఏమిటి?" అని అడిగాడు కోదండపాణి.

తను ఆ దేశపు యువరాణినని చెప్ప దలచలేదు, స్రవంతి. "రాజధానీ నగరంలో ఏదైనా పని దొరుకుతుందేమో అని బయలుదేరాను. ఒంటరి ప్రయాణంగనక, ఈ వేషం అయితే మంచిదనిపించింది. నా ప్రాణాలు కాపాడిన మీమేలు మరవను. సాయంకాలం కావస్తున్నది, బయలుదేరు తాను," అన్నది.

కోదండపాణి, ఆమె గాయానికి రాసు కోవడానికి లేపనం భరిణె యిచ్చి, గుర్రం ఎక్కడంలో ఆమెకు సాయపడి, "జాగ్రత్త! ఎక్కడా ఆగకుండా వెళ్ళితే, చీకటి పడక ముందే నగరానికి చేరగలవు!" అంటూ సాగనంపాడు.

ఆ రాత్రి స్రవంతికి కంటిమీద కునుకు లేదు. బాగా ఆలోచించి, ఒంటి కొమ్ము రాక్షసుడి కోటనుంచి బయటపడడానికి, బుద్ధిబలమొక్కటే మార్గమని నిర్ణయించు కున్నది.

మర్నాడు రాక్షసుడు, ఒక పెద్ద ఇత్తడి బిందెలో పాలు, పక్వానికి వచ్చిన అరటి పండ్ల గెల తీసుకువచ్చి, గది తలుపు తెరిచి, గుమ్మానికి అడ్డంగా కూర్చుంటూ, "ఇప్పుడు చెప్పవే, పిల్లా! మన పెళ్ళికి ముహూర్తం ఎప్పుడు?" అన్నాడు వికటంగా నవ్వుతూ.

వాడి ప్రశ్నకు స్రవంతి చిన్నగా నవ్వి, "ఆశ్చర్యం, బావయ్యా! నేను పెళ్ళి కొడుకుల్ని వెతుక్కుంటూ బయలు దేరానని నీవెలా గ్రహించావు? నువ్వు నాకు అన్నివిధాలా నచ్చావు. అయితే, నడినెత్తిన ఆ ఒంటికొమ్మువల్ల, కాస్త వికారంగా కనబడుతున్నావు. దాన్ని తీయించేస్తే సరి పోతుంది," అన్నది, గెలనుంచి ఒక పండు తుంచుతూ.

ఆ మాటలకు రాక్షసుడు మొహం చిన్నబుచ్చుకుని, "నా శక్తులన్నీ ఆ ఒంటి కొమ్ములోనే వున్నాయి. నీకు బావుండక పోతే దానికేసి చూడడం మానెయ్యి," అన్నాడు కోపంగా.

"అందం కోసం కాకపోయినా, నా పసుపుకుంకాల కోసమయినా దాన్ని తీసే యించాలి, తప్పదు! నాకు చిన్నతనం లోనే జ్యోతిష్కులు చెప్పారు- ఒంటికన్ను, ఒంటికాలు, ఇంటికి ఒక్కడే కొడుకు,



ఇటువంటి వాళ్ళను పెళ్ళాడితే, వాళ్ళకు పెళ్ళినాడే పరలోకయాత్రని. నీకు ఒంటి కొమ్ము తీసేయించడం ఇష్టంలేకపోతే, మరొక పెట్టుడుకొమ్ము పెట్టేయించుకో. అప్పుడు చూడడానికీ బావుంటుంది; నా జాతకదోషం నీకు ఎలాంటి హానీ కలిగిం చదు," అన్నది స్రవంతి.

రాక్షసుడు కాసేపు ఆలోచనలోపడి, "మా నాన్న తాలూకూ రెండు కొమ్ములూ కోటలోనే పడివున్నవి. వాటిని నా తల మీద అలంకరించుకోవడం ఎలా సాధ్యం?" అన్నాడు విచారంగా.

ఇలాంటి అవకాశం కోసమే చూస్తున్న స్రవంతి వెంటనే, "నన్ను, నువ్వెత్తుకొచ్చిన సరోవరం పక్కన వున్న జలపాతం దగ్గర, ఒక కుటీరంలో కోదండపాణి అనే గొప్ప వైద్యుడున్నాడు. అతడు శస్త్రవైద్యంలో



కూడా మహాదిట్ట. అతడి సాయం కోరితే, నీ సమస్య తీరిపోతుంది," అన్నది.

"అలాగా!" అంటూ రాక్షసుడు ఆత్రంగా కోట తలుపు మూసి బయటికి వెళ్ళి పోయాడు. స్రవంతి కోట అంతా తిరిగి చూసింది. ఒక మూల గదిలో రాసిగా పోసివున్న బంగారు కాసులు చూసి ఆమె కళ్ళు చెదిరిపోయాయి.

చీకటి పడుతూండగా రాక్షసుడు వచ్చాడు. అతడితో పాటు తనకు కావలసిన పరికరాలు, మందుతో కోదండపాణి వచ్చాడు. అయితే, ఇదివరలో అతడు, స్రవంతిని పురుషవేషంలో చూసి వుండడంతో, ఇప్పుడు యువతివేషంలో వున్న ఆమెను పోల్చుకోలేకపోయాడు.

స్రవంతిని తనకు కాబోయే భార్యగా, కోదండపాణికి పరిచయం చేశాడు రాక్షసుడు. "నా కాబోయే శ్రీవారి నెత్తిన రెండు కొమ్ములు మొలిపించే బాధ్యత మీదే!" అన్నది స్రవంతి నవ్వుతూ.

కోదండపాణి, రాక్షసుడి కొమ్మును పరీక్ష చేసి, "ఇప్పుడు తల మధ్యలో వున్న ఈ కొమ్మును శస్త్రం చేసి తీసివేయాలి. తర్వాత రెండు కొమ్ములను సమాన దూరంలో ఏర్పాటు చేయాలి. అలాకాకపోతే వికారంగా వుటుంది," అన్నాడు.

"ఉన్నకొమ్ము తీసేస్తే, నాశక్తులు పోతాయేమో!" అంటూ భయపడ్డాడు రాక్షసుడు.

"ఒకటి పోతేనేం, మామగారి కొమ్ములు రెండు వస్తాయి. అప్పుడు, నీ శక్తులు రెట్టింపవుతాయి!" అంటూ ధైర్యం చెప్పింది, స్రవంతి.

కోదండపాణి, రాక్షసుణ్ణి పడుకోమని, "బాధతెలియకుండా వుండడానికి, నీకు మత్తుమందు ఇస్తాను. ఆ తర్వాత ఒంటి కొమ్ము తీసేసి, మీనాన్న కొమ్ములు అమరుస్తాను," అని, రాక్షసుడి ముక్కులో ఏదో పసరు వేశాడు.

మరుక్షణం, రాక్షసుడు పెద్దగా ఓండ్ర పెట్టాడు, వాడికి స్పృహతప్పింది. కోదండపాణి చిన్నరంపంతో వాడి ఒంటి కొమ్ము కోసి ఒక మూలకు గిరవాటు వేశాడు.

"పీడావిరగడయింది! వాడి శక్తులన్నీ నశించాయి. పోదాంపద," అన్నది స్రవంతి ఆనందంగా. రాక్షసుడికి, వాడి తండ్రి రెండు కొమ్ములూ శస్త్రం చేసి అమరుస్తున్న కోదండపాణికి, ఆమె మాటలు చెవిన పడలేదు. ఆమె, పులిచేసిన గాయంమచ్చ

అతడికి కనబడేలా, చేతిని అతడి మొహం దగ్గరగా పెట్టింది.

"నువ్వా! పులిని చూసి హడలిపోయిన నువ్వు, ఈరాక్షసుడిని పెళ్ళాడబోతున్నావా?" అంటూ ఆశ్చర్యపోయాడు కోదండపాణి.

ఆసరికి రాక్షసుడికి రెండు కొమ్ములూ అమర్చే పనిముగిసింది. స్రవంతి, కోదండపాణి ముఖంలోకి పరీక్షగా చూస్తూ, "ఈ రాక్షసుణ్ణి నేను పెళ్ళాడడమా! వీడి చెరనుంచి తప్పించుకోవడానికి, నిన్ను రప్పించి, ఈ నాటకం ఆడాను. ముందు ఈ కోటలోంచి బయటపడాలి, పద!" అంటూ తొందరచేసింది.

ఇంతలో రాక్షసుడు పెద్దగా మూలిగాడు. కోదండపాణి, ఒక లోటాలో వున్న ద్రవాన్ని వాడి నోటిలో పోశాడు. వాడు కొద్దిసేపటికి గాఢనిద్రలో వున్న వాడిలా కదలామెదలకవుండిపోయి, సూర్యోదయం వేళకు కళ్ళుతెరిచి లేచి కూర్చున్నాడు.

అప్పుడు, కోదండపాణి వాడితో, "పాపం, ఈ అమ్మాయికి నీతో పెళ్ళి ఇష్టంలేనట్టుగా వుంది. నా శస్త్ర చికిత్సకు నువ్విస్తానన్న బంగారం నీ దగ్గరేవుంచుకుని, ఈమెను విడచిపెట్టు," అన్నాడు.

రాక్షసుడు కొంచెం సేపు ఆలోచిస్తూ వూరుకుని, "మా వంశంలో ఎవరికీ ఒంటి కొమ్ము లేదు. అందరూ నన్ను ఆటపట్టిస్తూండేవాళ్ళు. నా ఒంటికొమ్ము వల్లనే, మా నాయకుడి కూతురు లవంగి నన్ను పెళ్ళాడనన్నది. అందుకే విధిలేక, ఈ మరుగుజ్జును పెళ్ళి చేసుకోవాలను



కున్నాను. ఈ పిల్లకూ, నాకూ ఈడూజోడూ కుదురుతుందా, ఛీ! ఇప్పుడు, నా జంట కొమ్ములు చూసి, ఎగిరి గంతేసి నాతో పెళ్ళికి సిద్ధమవుతుంది లవంగి," అంటూ ఆనందంగా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

కోటలో వున్న బంగారు కాసులన్నీ, అక్కడేవున్న తోలుసంచులలో సర్ది, కోదండపాణికి ఇచ్చి, "నన్ను రెండు సార్లు కాపాడినందుకు, ఈ బంగారమంతా నీకే చెందాలి!" అని అతడికి చెప్పి, తన రాజభవనానికి తిరిగివెళ్ళింది, స్రవంతి.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, స్రవంతి ప్రవర్తన విడ్డూరంగానూ, అవివేకంగానూ లేదా? అందగాడూ, ధైర్యశాలీ, గొప్ప వైద్యుడే కాక, పులి బారినుంచి తనను కాపాడిన కోదండపాణిని పెళ్ళాడా

లన్న నిశ్చయంతో, స్రవంతి మరొకసారి అతణ్ణి చూడబోయింది కదా? ఈ తరుణంలో అతడు అనుకోకుండా రాక్షసుడి నుంచి కూడా ఆమెను కాపాడాడు. ఏ వృత్తిలో అయినా అంకిత భావంతో సేవ చేసేవాళ్ళు, వ్యక్తుల వేష భాషల్నీ అందచందాలనూ సాధారణంగా పట్టించు కోరు. ఈమాత్రపు లౌకికజ్ఞానం రాకుమారి స్రవంతికి లేదనుకోవడం అర్థరహితం. పేదయువతి వేషంలో వున్న తనను, కోదండపాణి గుర్తించలేక పోయినా, తాను రాకుమారినని చెప్పి, తన ఆంతరంగిక భావం వెళ్ళడిస్తే, అతడు పెళ్ళికి నిస్సం కోచంగా అంగీకరించి వుండేవాడనేందుకు ఆస్కారంవున్నది. ఆ పని స్రవంతి చేయక పోవడం, అవివేకం అనిపించుకోదా? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "స్రవంతి ఉద్దేశం, తన తండ్రి తర్వాత సింహాసనానికి అర్హుడైనవాణ్ణి పెళ్ళాడడం. అడవిలో కోదండపాణిని చూసిన తర్వాత, అతడు అందుకు అర్హుడన్న భావం, ఆమెకు కలిగింది. కాని, ఒంటికొమ్ము రాక్షసుడి విషయంలో అతడి ప్రవర్తన గమనించి నప్పుడు, ఎంతో గొప్పవైద్యుడైన కోదండ పాణి, ఆ వృత్తి విషయాలు తప్ప, ఇతరత్రా ఏవీ పట్టించుకోని నైజం కలవాడని గ్రహించింది. అడవిలో వుండే ఆదివాసు లకు వైద్య సేవలు చేస్తూ, అందులోనే తృప్తినీ, ఆనందాన్నీ పొందే అతడు, రాజ్య పాలనకు ఏవిధంగానూ అర్హుడు కాడన్నది తెలుస్తూనేవున్నది. ఆ కారణంగానే ఆమె, తన నిర్ణయం మార్చుకుని రాక్షసుడి కోటలో దొరికిన బంగారాన్ని అతడికిచ్చి తిరిగి వచ్చింది. ఇది ఎంతో వివేకవంతమైన పని,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

[ఆధారం:మాచిరాజు కామేశ్వరరావురచన]





# మొగధీరుడు!

పూర్ణమ్మా, రుద్రయ్యా భార్యాభర్తలు. పదేళ్ళనాడు పెళ్ళిపందిరిలో, ఇద్దరూ ఒకరికొకరు తగుచక్కగా కుదిరిపోయారని, పెళ్ళికొచ్చిన అమ్మలక్కలందరూ చాలా సంతోషించారు. కాని, క్రమంగా రుద్రయ్య దుర్వ్యసనాలకులోనై, ఆరోగ్యం చెడి కోపదారిగా తయారై, చీటిమాటికి భార్య పూర్ణమ్మ మీద చేయిచేసుకోసాగాడు.

ఇదిచూసి, ఇరుగు పొరుగువాళ్ళు, రుద్రయ్యకు వ్యసనాల నుంచీ, చెడుసావాసాల నుంచీ బయటపడమనీ, ఏ తప్పూచేయని తాలికట్టిన ఇల్లాలును అలా హింసించడం, రౌరవాదినరకాలకు కారణమవుతుందనీ, నయానా భయానా చెప్పిచూశారు.

కాని, రుద్రయ్య "అది నాభార్య. కొడతాను, నిలువునా చీరేస్తాను. నరకాలు, స్వర్గాలంటూ మధ్య నాకు నీతులు బోధించడానికి, మీరెవరు?" అంటూ అందర్నీ నానా తిట్లూ తిట్టాడు.

ఇలావుండగా, ఒకనాడు పూర్ణమ్మ చెరువుకు బట్టలుతకపోయినప్పుడు, మాటలసందర్భంలో రుక్మిణమ్మ అనే ఒక పెద్ద ముత్తయిదువుకు, రోజూ తన భర్త పెడుతున్న హింసలగురించి చెప్పుకున్నది. ఈ రుక్మిణమ్మ ఎంతో జీవితానుభవంగల మంచి వివేకవంతురాలు.

పూర్ణమ్మ చెప్పినదంతా శ్రద్ధగావిన్న రుక్మిణమ్మ, "నీభర్త రుద్రయ్య దుందుడుకు ప్రవర్తనగురించి, వాళ్ళూ వీళ్ళూ చెప్పగా విన్నాను. నీ కాపరం నిలవాలన్నా, భర్త చావుదెబ్బలనుంచి బయటపడాలన్నా, నువ్వు కాస్త సాహసించాలి. అది నీ స్వభావానికి విరుద్ధమైనదైనా తప్పదు. కావాలంటే, నువ్వెరిగిన పతివ్రతలందరికీ మనసులోనే నమస్కరించి, చెంపలేసుకో!" అంటూ రహస్యంగా ఏదో చెప్పింది.

రుక్మిణమ్మ చెప్పింది వింటూనే పూర్ణమ్మ వెలవెలపోతూ, "అవును, పిన్నీ, నువ్వు చెప్పింది సబబుగానే వుంది. కాని అంత సాహసం చెయ్యగలనా అన్నది, నాభయం. ఆయన పెట్టే బాధలన్నిటికీ విరుగుడు, పుట్టింటికి వెళ్ళిపోవడమే సరైన మార్గమని,

టి.శంభుదాసు

అప్పుడప్పుడూఅనుకుంటూంటాను" అన్నది.

అందుకు రుక్మిణమ్మ అయిష్టంగా తలాడించి, "భర్త కోపదారని, చేసే చేసే కాపరం వదిలి పుట్టింటికి పారిపోవడం ఏ ఆడకూతురూ చేయరాని పని. పైగా, నీ పుట్టిల్లు గురించి, నాకు బాగా తెలుసు. నీకా, ఇప్పుడు కని పెంచి పెద్దచేసిన తల్లి దండ్రులు లేరాయె! ఇక వున్న ఒక్కగా నొక్క అన్నా, వదినా. నీ అన్ననిన్ను తోబుట్టువని ఆదరించవచ్చు. మరి నీ వదిన మాటేమిటి?" అని ప్రశ్నించింది.

ఆ ప్రశ్నతో పూర్ణమ్మకు, తన తల్లి దండ్రులు పోయాక, ఇప్పటి పుట్టింటి పరిస్థితులెలా వున్నదీ గుర్తుకువచ్చింది. తన అన్నా, వదినెల మధ్య వున్న అన్యోన్యతే అంతంత మాత్రం. అలాంటప్పుడు, ఆ ఇంట్లో తన పరిస్థితి ఎలా మెరుగవుతుంది! ఇలా ఆలోచించిన పూర్ణమ్మ, చివరకు రుక్మిణమ్మ సలహానే పాటించదలచింది.

ఆ రాత్రి రుద్రయ్య బాగా పొద్దు పోయాక తూలుతూ, ఏదో గొణుక్కుంటూ ఇల్లు చేరుతూనే, పెద్ద గొంతుతో, "ఎక్కడే పూర్ణీ, ఎక్కడ?" అంటూ రెండుసార్లు కేకపెట్టి, పూర్ణమ్మ రాకపోయే సరికి, "ఇంత వాణ్ణి, మొగుణ్ణి! పిలిస్తే పలకవా? చూడు!" అంటూ మూలనున్న కర్ర తీసుకున్నాడు.

ఆ వెంటనే పూర్ణమ్మ గబగబా గదిలోంచి బయటివచ్చి, పూనకం వచ్చినదానిలా ఊగిపోతూ, "ఓరే, రుద్రా! ఎన్నాళ్ళుగానో గమనిస్తూనే వున్నాను. నువ్వు దుష్ట సావాసాలు మరిగి దుర్వ్యసనాలకు బాని సవైపోవడమేగాక, బంగారంవంటి నా కోడలిని, రోజూ ఎందుకు వేధిస్తున్నావు? ఇదుగో, నీకు తగిన బుద్ధిచెప్పబోతున్నాను," అంటూ, రుద్రయ్య చేతిలోని కర్ర లాక్కుని, అతడి వీపు మీదా, భుజాల మీదా దభీదభీమంటూ కొట్టసాగింది.

రుద్రయ్య ఆ దెబ్బలకు ఓర్చుకోలేక, పడకటింట్లోదూరి, పట్టెమంచం కింద దాక్కు న్నాడు. అయినా, పూర్ణమ్మ అతణ్ణి వదలక, "మంచం కింద దూరి దాక్కుంటావా? రా, బయటికి,రా!" అంటూ కర్రను తాటించింది.

రుద్రయ్య పట్టె మంచం కింద గడగడ వణికిపోతూ, "అమ్మా, ఈ క్షణంనుంచీ నీ కోడలిని కొట్టననీ, పల్లెత్తుమాట అననీ, నీమీద ఒట్టేసుకుంటున్నాను. ఒక్కమాట! నాపేరు రుద్రయ్య. మొగధీరుణ్ణి! మంచం కిందనుంచి బయటకురావడం, రాక పోవడం-అంతా నా ఇష్టం," అన్నాడు.

ఆ మాటలతో పూర్ణమ్మ కర్రను అక్కడే పారేసి, నవ్వుకుంటూ ఇంటి నడవాలోకి వెళ్ళిపోయింది.





# స్వర్ణ సింహాసనం

④

[కౌండిన్య దేశాధిపతి శ్రీదత్తుడు, గురుకులం నుంచి తన కుమారుడు విజయదత్తుణ్ణి రప్పించి తమరాజ్యాన్ని కబళించడానికి పొరుగురాజులు చేస్తున్న కుట్రనూ, తమ బంధువయిన మాధవసేనుడు వారితో చేతులు కలిపిన వైనాన్నీ వివరించాడు. అంతలో మాధవసేనుడి కుమార్తె శ్రీలేఖ అక్కడికి రావడంతో, ఆమెకూ విజయదత్తుడికీ వివాహం జరిపించాడు. రాజగురువు శివానందుల సలహా ప్రకారం తూర్పు దిశనవున్న మైదానంలో తవ్వకాలు ఆరంభమయ్యాయి. గోతిలో వేడిగాలులు చిమ్ముతూ మహాసర్పం ఒకటి కనిపించి, తాను అడిగే ప్రశ్నకు సరైన సమాధానం చెప్పే వ్యక్తికే లొంగుతానని శివానందులకు చెప్పింది. సర్పం అడిగే ప్రశ్నకు సమాధానం చెప్పమని శివానందులు విజయదత్తుణ్ణి ఆదేశించాడు. — తరవాత]

విజయదత్తుడు తండ్రికీ, శివానందుడికీ నమస్కరించి, సర్పం దగ్గరకు వెళ్ళి, "ఓ మహాసర్పమా! నువ్వు అడగదలచిన ప్రశ్న ఏదో అడుగు," అన్నాడు.

ఆ మాటకు సర్పం చిన్నగా కదిలి, "మహావీరా! ప్రశ్న అడగబోయే ముందు, ఒక ముఖ్యవిషయం చెబుతున్నాను, జాగ్రత్తగా విను. నా ప్రశ్నకు సరైన సమాధానం చెప్పిన వ్యక్తి కంఠాన్ని, నేను ఒక అపూర్వమైన పూలదండగా మారి అలంకరిస్తాను. సరైన సమాధానం చెప్పలేని వ్యక్తిని, కాలసర్పంగా కాటువేసి, యమపురికి పంపిస్తాను. ఈ నిబంధనను ముందుగానే నీకు తెలియజేశాను. నీకిష్టమైతేనే ప్రశ్న అడుగుతాను. లేని పక్షంలో నువ్వు నిరభ్యంతరంగా వెనుదిగి వెళ్ళవచ్చు," అన్నది.

ఆ మాటలు వింటూనే మహారాజు అదిరిపడి, "విజయా!" అని చేయెత్తి కొడుకును వారిస్తూ, చప్పున గోతిలోకి దిగబోయాడు.

మహారాజు ఆందోళన గమనించిన శివానందులు, అతడి చెయ్యి పట్టుకుని ఆపుతూ, "యువరాజుకు ప్రాణభయం

లక్ష్మీగాయత్రి



ఏమీ లేదు ప్రభూ! నామాట నమ్మండి," అన్నాడు ధైర్యం చెబుతూ.

సర్పంమాటలు వింటూనే ఒక్క క్షణం తటపటాయించిన విజయదత్తుడు, తర్వాత గంభీరంగా, "సర్పరాజా! నేను నీ నిబంధనకు లోబడుతున్నాను. ప్రశ్న అడుగు!" అన్నాడు.

వెంటనే సర్పం, "సరే విను! మూడింటా, మూడింటా, మూడు చేతా రాజు పాటించవలసిన మూడూ ఏవి?" అని ప్రశ్నించింది.

ఆ ప్రశ్న విని కొద్ది క్షణాలు ఆలోచించిన విజయదత్తుడు, "నీ ప్రశ్నకు, నా జవాబు విను! ముప్పొద్దులా, మూడు లోకాల్లోనూ, త్రికరణశుద్ధిగా రాజు పాటించవలసిన మూడూ సత్యమూ, ధర్మమూ, న్యాయమూ!" అన్నాడు.

వెంటనే సర్పం, "శభాష్, మహావీరా! సరైన సమాధానం చెప్పి నన్ను గెలుచుకున్నావు. ఈ క్షణానే నేనొక పూలదండగా నీ మెడ అలంకరిస్తాను. నేను నీ మెడలో వున్నంత కాలం, ఎంతటి కాలకూట విషమైనా, నీకు అమృతప్రాయమవుతుంది. ఇకపోతే ఇక్కడి నుంచి మరొక మూడడుగులకు తవ్విస్తే, నీకు మరొక అపురూపమైన కానుక కూడా లభిస్తుంది. విజయోస్తు!" అంటూ ఒక్కసారిగా గాలిలోకి నిలువునా లేచి మాయమై, స్వచ్ఛమైన ధవళకాంతులు విరజిమ్ముతున్న పుష్పహారంగా మారి, విజయదత్తుడి మెడలో పడింది.

ఆ తర్వాత తవ్వకాలు దాదాపు సాయంకాలందాకా సాగి, మరొక మూడడుగుల లోతుకు వెళ్ళేసరికి, కూలీలు పలుగులకు ఏదో లోహం తగులుతూ ఖంగుమన్న శబ్దం వినిపించింది. కూలీలు జాగ్రత్తగా, భూనిక్షిప్తమైవున్నదానిచుట్టూ గల మట్టిని తొలగించసాగారు.

మహారాజు గోతి అంచునే నిలబడగా, విజయదత్తుడు మాత్రం గోతిలోకిదిగి, భూగర్భంనుంచి బైటికి వస్తున్న ఆ లోహం ఏమిటా అని చూడ సాగాడు. అంతలో సూర్యాస్తమయమై చీకట్లు కమ్ముసాగాయి. అయితే, దివిటీల వెలుగులో కూలీలు పనిచేయసాగారు.

పని పూర్తిఅయ్యాక వార్త పంపవలసిందిగా, అక్కడున్న అధికారులకు చెప్పి, శ్రీదత్త విజయదత్తులిద్దరూ భవనానికి తిరిగివెళ్ళారు. మళ్ళీ వార్త అందేసరికి సూర్యోదయం కావస్తున్నది.

మహారాజు, విజయదత్తుడు, శ్రీలేఖ, శివానందులతో సహా మైదాన ప్రాంతాన్ని చేరుకుని, అక్కడ గోతిపైన నేలమీద పెట్టబడివున్న దాన్ని చూసి, ఆశ్చర్యానందాలతో కొద్దిసేపు నోట మాటరాకనిలబడిపోయారు.



ఎంతకాలంగానో భూనిక్షిప్తమైవున్నప్పటికీ, బాలసూర్యుని లేత కిరణాల వెలుగులో కాంతులు వెదజల్లుతూ, రాచరికపురీవికీ, హుందాతనానికీ, స్థైర్య ధైర్యాలకూ సాక్షిగా నిలిచివున్న, ఆ వస్తువు–ఒక పెద్ద సింహాసనం!

అపూర్వమైన ఆ సింహాసనపు శిఖర భాగాన, హైహయ వంశీకులకు దేవత అయిన గాయత్రీదేవిమూర్తి, శిల్పాకృతిలో చెక్కబడివున్నది. దేవిపాదాలకు దిగువగా, ఒక పెద్ద పద్మాకారం అలంకారంగా చెక్కబడింది. దేవి కిరీటపు మధ్యభాగాన అమూల్యమైన వజ్రం ఒకటి స్వచ్ఛమైన ధవళకాంతులు విరజిమ్ముతుండగా, పద్మానికి మధ్యలో ఒక కెంపు పొదగబడి, రుధిరారుణకాంతులు వెదజల్లుతున్నది.

సింహాసనానికి రెండు వైపులా రెండు సింహాకృతులు వున్నాయి. అవి, పెదవులు బిగించుకుని, కేవలం తమ గంభీరమైన దృష్టులద్వారా చూపరుల హృదయాల్లో కంపన కలిగిస్తూ, రాచరికపు మౌనగాంభీర్యాన్ని చాటి చెపుతున్నట్టుగా వున్నాయి.

అద్వితీయంగా వున్న స్వర్ణసింహాసనానికి మూడు మెట్లున్నాయి. మెట్టుకు రెండు చొప్పున ఆరు సాలభంజికల స్వర్ణ ప్రతిమలు, ఎదురుబొదురుగా నమస్కార భంగిమలో వున్నాయి. సింహాసనాన్ని అధిష్ఠించబోతున్న వ్యక్తికి నమస్కారాలతో స్వాగతంచెబుతున్నట్టుగావున్న, ఆ సుందరీ మణుల రమణీయమైన శిల్పాలు, ప్రతి ఒక్కరినీ విశేషంగా ఆకర్షించాయి.

సింహాసనంకేసి చూస్తూ మహారాజు, సింహాసనస్థ అయిన తమ కులదేవతకు చేతులెత్తి నమస్కరించి, మనసులోనే, "అమ్మా, మేమంతా నీ బిడ్డలం! నీ పాదాల సాక్షిగా ఈ సింహాసనంపైనే విజయుడికి రాజ్యాభిషేకం జరిపిస్తాను. అతణ్ణి సర్వకాలాల్లోనూ ఇలాగే చల్లగా చూడు!" అని ప్రార్థించాడు.

విజయదత్తుడు కూడా శ్రీలేఖా సహితంగా దేవికి మొక్కాడు.

తర్వాత, సింహాసనాన్ని పదిలంగా సభా భవనానికి చేర్చవలసిందిగా, అధికారులకు చెప్పి, శ్రీదత్త, విజయదత్తులిద్దరూ



శ్రీలేఖను తీసుకుని, శివానందులు వెంట రాగా అంతఃపురానికి తిరిగివచ్చారు.

వారు అంతఃపురానికి వచ్చేసరికి, అక్కడ శిలీముఖుడనే గూఢచారి ఒకడు వారికోసం వేచివున్నాడు. మహారాజును చూడగానే వినయంగా నమస్కరించి శిలీ ముఖుడు, రాజు ఆజ్ఞాపించిన మీదట ఇలా చెప్పాడు:

"చంపక ప్రభువైన మరాళభూపతి, తన కొడుకు చక్రభూపతితో, కొద్దిపాటి సైన్యంతో, కాళింది దేశంలో విడిదిచేసి వున్నాడు. కాళింది రాకుమారికీ, చక్ర భూపతికీ వివాహ ప్రదాన ఉత్సవం జరి పించటంకోసం, అతడు ముందుగా వచ్చాడు. అయితే, అనుకోని విధంగా కాళింది రాకుమారి అదృశ్యమైంది. ఆమె పురుషవేషంతో మన దేశానికే పారిపోయి వచ్చివుంటుందని, మరాళ, చక్రభూపతు లిద్దరూ అభిప్రాయపడు తున్నారు. కాళిందిప్రభువు అనుమానమూ అదే! కాగా, జరిగిందేదో జరిగిపోయిందనీ, యుద్ధవ్యూహాన్ని యథాతథంగా కొనసాగ నిద్దామనీ, మరాళభూపతి పంపిన వార్తకు, కాళింది ప్రభువు తన అంగీకారాన్ని తెలి యజేశాడు. ఈ పాటికి, చంపకదేశంలో యుద్ధ సన్నద్ధులైవున్న చంపక, కుందదేశపు సైన్యాలు రెండూ, కౌండిన్యదేశం కేసి బయలుదేరివుంటాయి. కాళింది సైన్యం, మరాళుడితో వున్న కొద్దిపాటి సైన్యం జ్యేష్ఠ బహుళ పంచమినాటి రాత్రి బైలుదేరు తాయి. మనదేశానికీ, కాళింది దేశానికీ మధ్య సరిహద్దుగా వున్న కాళిందీ నది ఒడ్డున మూడు దేశాల సైన్యాలూ కలుసు కుని, ఒక్క పెట్టున నది దాటి మనదేశం పై విరుచుకు పడతాయి. ఈ మూడు సైన్యాలూ కలుసుకుని, మనతో ప్రత్యక్ష యుద్ధం ప్రారంభించే నాటికి ఆషాఢమాసపు శుక్లపక్షం చివరిరోజులు వస్తాయని వారి ఊహ! ఇప్పటి వరకూ మాకు తెలిసిన సంగతులు ఇవి!"

శిలీముఖుడు తెచ్చిన వార్త వినగానే, మహారాజు అయోమయంగా కొడుకు వైపుచూస్తూ, "విజయా, ఏమిటిది? శిలీ ముఖుడు తెచ్చినవార్తను బట్టి, మీ మామ ఇంకా శత్రుపక్షానే వున్నాడని స్పష్టమ వుతున్నది. అంటే, నిన్న మనకు వచ్చిన పావురపుటపా, కేవలం మనను పక్కదారి పట్టించటానికని అనుకోవచ్చునా?" అన్నాడు.

తండ్రిమాటలతో విజయదత్తుడు కూడా ఆలోచనలోపడి, చివరకు, "బహుశా

కాకపోవచ్చు, నాన్నా! మామయ్య ఇప్పుడు శత్రుకూటమి మధ్యలో వున్నాడు. మరాళుడికి తన సైన్యాలేకాక, కుందదేశపు సైన్యాలుకూడా అండగా వున్నవి. తన దేశంలో వున్నాడు గదా అని ఒంటరివాణ్ణిచేసి, మరాళుణ్ణీ, అతడి కొడుకునీ బంధిస్తే, అటునుంచి చంపక, కుంద సైన్యాలు రెండూ కాళింది దేశం మీద విరుచుకుపడే అవకాశం ఎంతైనా వుంది. ఇదంతా ఆలోచించి మామయ్య, తనలో పరివర్తన కలిగినా, శత్రుపక్షంలోనే వున్నట్టు నటిస్తున్నాడేమో!" అన్నాడు.

కొడుకు మాటలకు మహారాజు కూడా సాలోచనగా, "అలా జరిగే అవకాశం లేకపోలేదు. యుద్ధనీతిని అనుసరించి అతడు మిత్రుడుగా నటిస్తూ, శత్రు పక్షంలోనే వుండివుంటే, మనకు కనీసం మరొక పావురపు టపా అయినా వచ్చి తీరాలి. ఏది ఏమైనా మనం త్రిసైన్య కూటమిని ఎదుర్కోవటానికి తగు ఏర్పాట్లలో వుండాలి. ఆపైన జయాపజయాలు దైవాధీనాలు!" అని, శివానందుల వైపు తిరిగి, ఆచార్యా, పరిస్థితి గ్రహించారు గదా! త్వరలోనే మనం యుద్ధరంగంలోకి దిగకతప్పదు. కొద్ది సేపటి క్రితం, అపురూపంగా దొరికిన ఆ స్వర్ణసింహాసనాన్ని చూడగానే నా కుమారుడికి ఎనలేని అదృష్టం పట్టిందని పొంగిపోయాను. ఆ పరవశంతోనే సింహాసనస్థ అయిన మా కులదేవత పాదాల సాక్షిగా విజయుణ్ణి, ఆ సింహాసనంపై అధిష్ఠింప చేస్తాననీ, అతణ్ణి చల్లగా కాపాడమనీ, ఆ దేవిని ప్రార్థించాను. కాని, పరిస్థితి చూస్తూంటే నా కోర్కె ఇప్పట్లో



నెరవేరే అవకాశం లేనట్టు కనిపిస్తున్నది," అన్నాడు.

మహారాజు మాటలకు శివానందుడు మృదువుగా, "మహారాజా, నే చెప్పదలచుకున్న విషయాన్ని మీరే ప్రస్తావించారు. యువరాజుకు ప్రస్తుతం జ్యోతిశ్శాస్త్రంలోనే చెప్పుకోదగ్గ మహర్దశనడుస్తున్నది. అతడికి నిన్నటివరకూ కాస్త ప్రాణభయం వుండేది. నిన్నటితో అదికూడా తీరిపోయింది. ఇప్పుడు అతడి గ్రహస్థితి దృష్ట్యా, అతడు పట్టిన ఇనుపముక్క చంద్రహాసమై శత్రువులను వెంటాడి వధించగలదు. ఇటువంటి స్థితిలో, అతడికి అపూర్వంగా లభించిన స్వర్ణ సింహాసనంపై వెంటనే, ఎటువంటి ఆలస్యమూ చెయ్యకుండా పట్టాభిషిక్తుణ్ణి చెయ్యటం చాలా శుభదాయకమని, నా



నా బిడ్డను పరిపూర్ణంగా కటాక్షిస్తాడన్న విశ్వాసం, నాలో ప్రబలుతున్నది. అంతా మీయిష్టప్రకారమే కానివ్వండి!" అన్నాడు.

మహారాజు మాటలకు శివానందులు ఆనందిస్తూ, "చాలా సంతోషం, మహారాజా! యువరాజు సింహాసనాధీశుడు కావటానికి సరైన ముహూర్తం కూడా నేను నిర్ణయించే వుంచాను. నేటికి సరిగ్గా నాలుగు రోజుల తర్వాత, జ్యేష్ఠబహుళపంచమీ శుక్రవారం నాటి ఉదయం,విజయదత్తుడిజాతకరీత్యా తిరుగులేని ముహూర్తం.ఆనాటి ఉదయం సూర్యోదయమైన రెండు ఘడియల తర్వాత, అతణ్ణి పట్టాభిక్తుణ్ణి చెయ్యటానికి కావలసిన ఏర్పాట్లు చెయ్యండి,"అన్నాడు.

శివానందుల మాటలకు విజయదత్తుడు అప్రయత్నంగా, "అక్కడ శత్రుకూటమి యుద్ధానికి బైలుదేరేరోజే, ఇక్కడ పట్టాభిషేక మన్నమాట!" అన్నాడు.

శ్రీదత్తుడు, శివానందులు పెట్టిన ముహూర్తానికి అంగీకరించాడు. ముగ్గురూ కలిసి–పట్టాభిషేకం క్లుప్తంగా నిరాడంబరంగా జరపాలనీ, జనాన్ని ఆకర్షించే ఆర్భాటాల జోలికి పోరాదనీ నిర్ణయించుకున్నారు.

తక్షణం రాజధానిలో విజయదత్తుడి రాజ్యాభిషేకపు ఏర్పాట్లు ప్రారంభమయ్యాయి. వాటితోపాటు యుద్ధ సన్నాహాలు కూడా తీవ్రతరమయ్యాయి. సైనికులు తమ కత్తుల అంచులపదును రెట్టింపు చేసుకుని, ఖడ్గచాలనాన్ని మరింత తీవ్రంగా అభ్యసిస్తూ, వాటిని తళతళమని పిస్తూండగా, రాజభవనంలో అసంఖ్యాకులైన స్వర్ణకారులు తమ పనిముట్లతో,

మనసుచెబుతున్నది. విజయదత్తుడు మహారాజుగా సైన్యానికి నాయకత్వం వహించి, విజయలక్ష్మిని వెంటబెట్టుకు రాగలడు!" అన్నాడు.

శివానందుల మాటలను, శ్రీ దత్త, విజయదత్తు లిద్దరూ వ్యతిరేకించ లేక పోయారు. ఆ తర్వాత కొద్దిక్షణాలపాటు అక్కడ నిశ్శబ్దం తాండవించింది.

తన కుమారుడు మాట్లాడకుండ వూరుకోవటాన్ని, అంగీకారంగా భావించిన శ్రీదత్తుడు, చేతులెత్తి దైవానికి నమస్కరిస్తూ, "అంతా మా కులదేవత అయిన గాయత్రీదేవిదయ! గతకొద్ది రోజులుగా కలలో కూడా ఊహించని విధంగా జరుగుతున్న, ఈ సంఘటనలన్నీ, దైవ ప్రేరితాలుకాని మానవకల్పితాలు కావు. మీ మాటలు వింటూంటే, ఆ దైవం

అపూర్వమైన స్వర్ణసింహాసనాన్ని మెరుగు పెడుతూ, ఆపరిసరాల్నే ధగధగలాడించటం ప్రారంభించారు.

ఇలా రోజొకక్షణంగా గడిచి, జ్యేష్ఠ బహుళపంచమి రానే వచ్చింది.

హైహయరాజుల సభాభవనం కర్పూర, కస్తూరికా పరిమళాలతో బాటు, అలంకారంగావేలాడదీసిన రకరకాల పూలదండల సువాసనలతో ఘుమఘుమలాడసాగింది. భవనపు మధ్యభాగాన, రకరకాలకుడ్య చిత్రాలతో, వివిధరకాలైన మణులతో ముత్యాలజాలరులతో అలంకరించబడిన విశాలమైనశాలలో, అగ్రభాగాన ధగద్ధగాయమానంగా కాంతులీనుతున్న స్వర్ణసింహాసనం అమర్చబడివుంది. సింహాసనపు దిగువ భాగాన, ముఖ్య రాజోద్యోగులందరికీ, ఆసనాలు ఏర్పరచబడ్డాయి. వారివెనుకనుంచి సామాన్యప్రజయథేచ్ఛగా విజయదత్తుని రాజ్యాభిషేక సంరంభాన్ని తిలకించే వీలుకల్పించబడింది.

ఈ ఏర్పాట్లూ, అలంకరణలన్నింటికీ మకుటాయమానంగా, సింహాసనానికి కుడిపక్కగా వేదవిదులైన బ్రాహ్మణులు కూర్చుని, ఉచ్ఛస్వరాలతో వేదగానం చేస్తూండగా, సింహాసనానికి ఎడమవైపున కూర్చునివున్న సంగీతవిద్వాంసులు, తమ మంగళ వాద్యాలశృతులను మరొక్కసారి సరిచూసుకుంటున్నారు.

ఎవరికివారు అమితోత్సాహంతో ఎదురుచూస్తుండగా, శివానందులు నిర్ణయించిన ముహూర్తం సమీపించింది.

శివానందులు ఆజ్ఞాపించిన మీదట, తండ్రిపాదాలకు ప్రణమిల్లి, శ్రీలేఖతో పాటు స్వర్ణసింహాసనపు తొలిమెట్టుమీద, తన కుడిపాదాన్ని ఆనించబోయాడు, విజయదత్తుడు.

ఆ మరుక్షణం, కోమలగంభీరమైన ఒకస్వరం, వర్షాకాలపు మేఘంలా గర్జిస్తూ, "విజయదత్తా, ఆగు!" అన్నది.

-(ఇంకావుంది)



# భారత సం

*ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు–*
*తరతరాలుగా సత్యంకోసం జరిగిన అన్వేషణ!*

## 3. గంగావతరణం

సాయంకాలం బడి నుంచి రాగానే, "అమ్మా, నాకు వ్యాసరచన పోటీలో మొదటి బహుమతి వచ్చింది!" అన్నాడు తల్లి జయలక్ష్మితో సందీపుడు.

"నిజంగానా!" అన్నది తల్లి ఆనందంతో.

"అవునమ్మా. ఆ బహుమతి రావడానికి కారణం మన తాతయ్య. నిజానికి ఆ బహుమతి ఆయనకే ఇవ్వాలి," అన్నాడు సందీపుడు.

"అలాగా!" అంటూ చిన్నగా నవ్వింది జయలక్ష్మి.

"భారత చరిత్రలో మీకు నచ్చిన పాత్ర, మన పురాణాలలో మీకు నచ్చిన పాత్ర, మీకు తెలిసిన వారిలో మీకునచ్చిన వ్యక్తి అనే మూడు శీర్షికల కింద వ్యాసరచన పోటీలు నిర్వహించారు. పురాణాలలో నాకు నచ్చిన పాత్ర అనే అంశాన్ని తీసుకుని నేను నచికేతుణ్ణి గురించి రాశాను. నచికేతుడి తండ్రి అతన్ని యముడికిస్తానని చెప్పాడంటే, అతన్ని యమలోకానికి పంపినట్టు అర్థంకాదు; అతన్ని మరణ రహస్యం గురించి తీవ్రంగా ఆలోచించమని ఆజ్ఞాపించాడు. అతడు మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ నిద్రాహారాలు మాని ధ్యానంలో గడిపి మరణ రహస్యాన్ని తెలుసుకున్నాడు అని వివరించాను. ఆ వివరణను న్యాయనిర్ణేతలు మెచ్చుకుని నాకు మొదటి బహుమతి ఇచ్చారు!" అన్నాడు సందీపుడు.

"నచికేతుడి కథలో ఇంత అంతరార్థం వుందని నాకు తెలియదు!" అన్నది జయలక్ష్మి ఆశ్చర్యంగా.

"ఆ కథలలో ఇలాంటి నిగూఢార్థాలు లేకుంటే వాటిని మనం ఎప్పుడో మరిచిపోయి వుండేవాళ్ళం. మన కథలు వేలాది సంవత్సరాలు నిలిచి ఉన్నాయంటే దానికి కారణం వాటిలో ఇమిడివున్న నిగూఢ సందేశాలే", అంటూ తాత దేవనాథుడు తన గది నుంచి వెలుపలికి వచ్చాడు.

"తాతయ్యా, మీరు నదీతీరంకేసి వెళుతున్నారా? నేనూ వస్తాను," అన్నాడు సందీపుడు ఉత్సాహంగా.



# స్మృతి-చరిత్ర



"నేనూ వస్తాను," అంటూ శ్యామల వాకిలి కేసి పరిగెత్తుకువచ్చింది.

ముగ్గురూ కొంత సేపటికి నదీ తీరం చేరారు.

"మనం గంగానదికి ఒక శాఖ అయిన నదీ తీరంలో ఉంటున్నాం కదా! మరి గంగానదిని పవిత్రంగా ఎందుకు భావిస్తారో మీకు తెలుసా?" అని అడిగాడు దేవనాధుడు.

"నాకు తెలుసు. ఎందుకంటే, గంగానది ఋషీకేష్, హరిద్వార్, వారణాశి వంటి పవిత్ర క్షేత్రాల గుండా ప్రవహిస్తున్నది కదా! అందు కని!" అన్నది శ్యామల.

"కాదు, కాదు. గంగానదీతీరంలో ఉండడం వల్లే ఆ క్షేత్రాలు పవిత్రమయ్యాయి!" అన్నాడు సందీపుడు.

"కాదు. నువ్వేదో మహాతెలివైనవాడినని నిరూపించడానికి ప్రయత్నిస్తున్నావా?" అన్నది శ్యామల.

"నేను తెలివైనవాణ్ణే. అయినా, నీ కంటే తెలివైనవాణ్ణి అని నిరూపించాడానికే ఈ ప్రయత్నం!" అన్నాడు సందీపుడు.

"మీరిద్దరూ తెలివైన వాళ్ళే. అందుకు పోట్లాట ఎందుకు గాని, ఇలారండి. కేవలం పుణ్యక్షేత్రాలవల్ల నదికి పవిత్రతగానీ, ఆ నది ప్రవహించడంవల్లే ఆయా క్షేత్రాలకు పవిత్రత గానీ సిద్ధంచలేదు. ఈ రెండూ కూడా పవిత్రం కావడానికి ఇతర కారణాలు ఉన్నాయి. గంగను పావనగంగగా ఎందుకు భావిస్తామో ఇప్పుడు నాకు తెలుసుకోవాలని ఉన్నది," అన్నాడు దేవనాధుడు.

"చెప్పండి, తాతయ్యా!" అన్నది శ్యామల కుతూహలంగా.

"నాకు తెలుసుకోవాలని ఉన్నది, అని చెప్పాను కదా? మీరే నాకు ఆ విషయం చెప్పాలి!" అన్నాడు దేవనాధుడు.

"మాకు తెలియదే," అన్నాడు సందీపుడు.

"తెలుసుకోవడానికి ప్రయత్నించండి. మీకు తెలియలేదంటే మీ స్నేహితులను అడగండి. ఉపాధ్యాయులను అడగండి. రేపు వచ్చి నాకు చెప్పండి," అన్నాడు దేవనాధుడు.

ఆసక్తికరమైన విషయాలను చెబుతానని తనతో వచ్చిన పిల్లలను నిరాశపరచకుండా, దేవనాధుడు వారికి ప్రపంచంలోనే చాలా పొడవైన నైలునదిని గురించీ, అమెజాన్ నదిని గురించీ వివరించాడు. అమెజాన్ నది జన్మ స్థానాన్ని 1971 వ సం॥ లోనే అమెరికాకు చెందిన నూతన ప్రాంతాల అన్వేషకుడు మెల్న్‌టైర్

| విశ్వాపేసు |
|---|



కనుగొన్న విషయం చెప్పాడు.

"అతి పెద్దదైన ఆ నది ఎక్కడ పుడుతుందో తెలుసుకోకుండా, ఇంతకాలం ఎలావుండగలి గారు తాతయ్యా?" అని అడిగింది శ్యామల.

"చాలా విషయాల గురించి మనకు ఏమీ తెలియదు. అయితే, ఆ నిజాన్ని మన అహం అంగీకరించదు. మనిషి పుట్టడానికి ముందు ఎంతో కాలంనుంచి ఇక్కడ ప్రకృతి ఉన్నది. ప్రకృతిలో ఒక క్రమం ఉన్నది. కాని మనిషి పర్యవసానాలను పట్టించుకోకుండా కొండలనూ, అడవులనూ నిర్మూలిస్తున్నాడు. నదీ మార్గాలతో ఆడుకుంటున్నాడు. మన పూర్వులు పర్వతాలనూ, నదులనూ దేవుళ్ళుగా, దేవతలుగా ఆరాధించారు. ప్రకృతికి ఆధారంగా కొన్ని అదృశ్యశక్తులు ఉన్నాయని భావించిన ఋషులూ ఉన్నారు. మామూలు ప్రజలు కొండలనూ, నదులనూ భక్తిభావంతో పూజించేవారు," అన్నాడు దేవనాధుడు.

"మరి ఆ భక్తి భావం ఎలా మారిపోయిందంటారు?" అని అడిగాడు సందీపుడు.

"క్రమేణా, మనిషిలో ప్రతిదానినీ తక్షణ ప్రయోజనంతో కొలిచే బుద్ధి పెరిగింది. రేపు ఏమైనా ఫరవాలేదు; ఈరోజు సుఖంగా గడిస్తే చాలు అనే మనస్తత్వం పెచ్చు పెరిగిపోయింది. ఈ తరం మనుషుల్లో గతంపట్ల ధిక్కారం, భావి తరాలపట్ల అశ్రద్ధ ప్రబలిపోయాయి. అందువల్ల వాతావరణకాలుష్యం జరుగుతోంది. ప్రకృతి ప్రసాదించిన అమూల్యమైన వరాల్లాంటి పురాతనమైన అరణ్యాలు అంతరించి పోతున్నాయి. నదులు మార్గాలు మార్చుకుంటున్నాయి; నానాటికి అడుగంటి కృశించి పోతున్నాయి," అన్నాడు దేవనాధుడు.

చీకటి పడుతూండగా ముగ్గురూ ఇల్లు చేరారు. పిల్లలిద్దరూ విచారంతో మౌనం వహించారు. వాళ్ళ విచారాన్ని పోగొట్టడానికి దేవనాధుడు నవ్వుతూ, "నాతరం వాళ్ళకన్నా, మీ తల్లిదండ్రుల తరం వాళ్ళకన్నా, మీ తరం వాళ్ళు వివేకవంతులుగా నడుచుకోగలరని నేను ఆశిస్తున్నాను. ప్రకాశవంతమైన భవిష్యత్తును రూపొందించుకోవాలంటే గతాన్ని చక్కగా అర్థం చేసుకోవాలి. అదిసరే, రేపు మీరు నాకు గంగావతరణం గురించి చెప్పాలి, గుర్తుందా?" అన్నాడు.

"అలాగే, తాతయ్యా," అంటూ పిల్లలిద్దరూ తల్లి దగ్గరికి వెళ్ళారు.



మర్నాడు సాయంకాలం సందీపుడు దేవనాధుడి గదిలోకి అడుగు పెడుతూ, "తాతయ్యా! గంగావతరణం గురించి నేను ఒక పుస్తకంలో చదువుకుని వచ్చాను," అన్నాడు.



"నేను మా ఉపాధ్యాయులను అడిగితెలుసుకున్నాను, తాతయ్యా!" అన్నది శ్యామల లోపలికివస్తూ.

"అలాగా! మంచిది. చెప్పండి మరి," అన్నాడు దేవనాధుడు.

ఒకరి తరవాత ఒకరుగా ఇద్దరూ పోటీపడి గంగావతరణ కథనుచెప్పడం ప్రారంభించారు:

ఒకానొకప్పుడు సగరుడనే రాజు అశ్వమేధ యాగం

తలపెట్టి, యాగాశ్వాన్ని వదిలాడు. అది భూలో కాన్నంతా తిరిగి విజయవంతంగా తిరిగి వచ్చినట్టయితే సగరుడు భూమండలానికి చక్రవర్తి అవుతాడు.

అయితే, ఒకనాడు యాగాశ్వం కనిపించ కుండా పోయింది. దాని వెంట వచ్చిన రాకుమారులు ఎక్కడెక్కడో వెదికారు. కాని ఫలితం లేకుండా పోయింది. అది భూలోకంలో కనిపించలేదు గనక, పాతాళలోకంలో వెదకమని సగరుడు తన అరవైనాలుగువేల మంది కుమారులను ఆజ్ఞాపించాడు. వాళ్ళు భూమిని తవ్వుకుంటూ పాతాళానికి వెళ్ళారు. అక్కడ కపిలముని ఆశ్రమం ముందు యాగాశ్వం చెట్టుకు కట్టబడి కనిపించింది. తమ యాగాశ్వాన్ని దొంగిలించాడని భావించి సగరకుమారులు మునిని దూషించారు. మరుక్షణమే ముని శాపానికి గురై అందరూ బూడిదరాసులుగా మారిపోయారు!

అసలు జరిగిందేమిటంటే— సగరుడిపై పగసాధించడానికి ఇంద్రుడు యాగాశ్వాన్ని దొంగిలించి, ముని ఆశ్రమం ముందు బంధించి వెళ్ళాడు!

కపిలముని గొప్ప తపోసంపన్నుడు గనక, రాజు సగరుడు ఆయన్ను ఏమీ చేయలేక పోయాడు. ఆయన మనవడు అంశుమానుడు గానీ, అతడి కుమారుడు దిలీపుడుగానీ, తాత తండ్రులకు శాపవిముక్తి కలిగించలేక పోయారు.

ఆఖరికి దిలీపుడి కుమారుడు భగీరథుడు పాతాళంలో బూడిద రాసులుగావున్న తన పూర్వులకు శాప విముక్తి కలిగించాలని నిశ్చయించాడు. కపిల ముని దగ్గరికి వెళ్ళి తన ముత్తాతల అపరాధాన్ని క్షమించి శాపవిముక్తి ప్రసాదించమని ప్రార్థించాడు.

కపిలముని భగీరథుడి ప్రార్థనను మన్నించాడు. బూడిదరాసులుగా వున్న సగర కుమారులు మళ్ళీ సజీవులు కావాలంటే ఆకాశగంగ భూమికి దిగిరావాలి; గంగాజలంతో బూడిదరాసులు పునీతం కావాలి, అని చెప్పాడు.

ఆకాశగంగ రక్షకుడు బ్రహ్మ. భగీరథుడు హిమాలయాలకు వెళ్ళి బ్రహ్మను గురించి ఘోర తపస్సు చేశాడు. ఆయన తపస్సుకు మెచ్చి



బ్రహ్మ ప్రత్యక్షమై గంగలో ఒక పాయను భూమికి వదలగలనని వరమిచ్చాడు. అయినా, ఆకాశ గంగ భూమికి ఉరికే వేగాన్ని భూమి తట్టు కోగలదా? గంగను భరించగల వారెవరు? అందుకని భగీరథుడు శివుణ్ణి ప్రార్థించాడు. శివుడు భగీరథుడి ప్రార్థనను మన్నించి, గంగను తలపై దాల్చడానికి అంగీకరించాడు.

బ్రహ్మ అనుమతితో, దివినుంచి భువికి దిగి రావడానికి గంగ మొదట శివుడి శిరస్సు మీదికి ఉరికింది. శివుడి జటాజూటాల నుంచి ఒకపాయ హిమాలయపర్వతం మీదికి జారి, కొండలూ, కోనలూ దాటుకుంటూ మైదానం చేరింది.

భగీరథుడు శంఖనాదం చేస్తూ, ముందు వెళుతూంటే గంగా ప్రవాహం ఆయన్ను అనుస రించి, భూలోకాన్ని చుట్టుముట్టి, అక్కడినుంచి పాతాళానికి చేరింది. గంగాజలం బూడిద రాసులపై ప్రవహించగానే అరవైనాలుగు వేల మంది సగరకుమారులు ప్రాణాలతో లేచి వచ్చారు!

శ్యామలతో కలిసి గంగావతరణ కథను పూర్తిచేసిన సందీపుడు – "దివి నుంచి భువికి దిగివచ్చిన దివ్యనది గంగ. అది సగర కుమారుల శాపాన్ని పోగొట్టింది. అందుకే అది పవిత్రమైనది. అంతే కదా, తాతయ్యా?" అన్నాడు.

"మీరు ఆ కథ చెప్పిన విధానం చాలా బావుంది. అయితే, గంగ పుట్టుకకు సంబం ధించిన మరొక కథ కూడా వుంది. అది అంత ప్రసిద్ధం కాదు. భూమి మీదికి దిగడానికి పూర్వపు ఆకాశగంగ జన్మ వృత్తాంతం అది! ఆ కథను కూడా తెలుసుకుంటే, దాని పవిత్రతకు సంబంధించిన విషయం మరింత విశదమవు తుంది. ఇక్కడ మరొక విషయం మరిచిపో కూడదు. పురాణకథలు చాలావరకు సంకేతాలే. ఒకసారి ప్రాణాలు పోగొట్టుకున్నవారు పావన గంగా జలం తగలగానే మళ్ళీ ప్రాణాలతో లేచి వచ్చారు అంటే – మరణ శాపం నుంచి దైవ కృప విముక్తి కలిగించకలదనే అర్థంచేసు కోవాలి," అన్నాడు దేవనాథుడు.

"ఆకాశగంగ జన్మవృత్తాంతం చెబుతా నన్నారు కదా? దానిని చెప్పండి, తాతయ్యా!" అన్నది శ్యామల కుతూహలంతో.

"రేపు చెబుతాను, చిట్టితల్లీ!" అన్నాడు దేవనాథుడు. – (ఇంకాఉంది)






# మంచితనం - మంచిధనం

వీరభద్రం అనేవాడికి, తల్లీ తండ్రీ చిన్నప్పుడే పోయారు. వాడితాత రాఘవయ్య, వాడికే లోటూతెలియకుండా గారాబంగా పెంచాడు. రాఘవయ్య తనకున్న అరెకరం పొలంలో, రకరకాల కూరగాయలు పండించేవాడు. వాటిని అమ్మగా వచ్చిన డబ్బుతో, వాళ్ళ జీవితం హాయిగా గడిచిపోయేది.

వీరభద్రం పెరిగి పెద్దవాడయ్యాడు. అతిగారాబంగా పెరగడం మూలాన చదువు అబ్బలేదు. చదువుకోకుండా సోమరిగా తిరగడం మూలాన పనిచెయ్యడానికి ఒళ్ళు వంగలేదు. రాఘవయ్యకు రోజురోజుకూ వయసు మీద పడటం మూలాన మునుపటిలా కష్టపడలేక పోతున్నాడు. అందువల్ల ఆదాయం తగ్గింది. వీరభద్రానికి చిల్లర ఖర్చులకు డబ్బులందటం మాట అటుంచి, పూట గడవటం కష్టమయ్యే పరిస్థితి వచ్చింది.

చేతిలో పైసా లేకుండా కాలంగడపటం వీరభద్రానికి కష్టమైపోయింది. వాడు ఎరిగినవాళ్ళ దగ్గర చేబదులు అడిగి తీసుకోవటం మొదలుపెట్టాడు. రాఘవయ్య ముఖం చూసి మొదట్లో కొంతమంది, వీరభద్రం అడగ్గానే డబ్బిచ్చినా, తర్వాత మానుకున్నారు. ఇదికాదని వాడు, తన అవసరంమేరకు సమయానుకూలంగా వాళ్ళనూ, వీళ్ళనూ బెదిరించి డబ్బులు వసూలు చేయసాగాడు.

చిన్నప్పటి నుంచీ పనీపాటూ లేకుండా పెంచిన శరీరం కాబట్టి, వీరభద్రం బలంగా, దిట్టంగా వుండి, ఒకే సమయంలో ఇద్దరు ముగ్గుర్ని ఎడాపెడా కొట్టగలిగేవాడు. వీరభద్రంలో వస్తున్న మార్పు చూసి, అదంతా తన పెంపకంలోని లోపమని రాఘవయ్య చాలా బాధ పడసాగాడు.

వీరభద్రం ఊరిమీదపడి తిరుగుతూ, ఆకలి అనిపించినప్పుడల్లా చిరుతిళ్ళు తింటూ, రాత్రికి ఏ గుళ్ళోనో, సత్రంలోనో పడుకుంటూ క్రమంగా ఇంటికి రావడం మానేశాడు.

దాసరి వెంకటరమణ



వీరభద్రం ఏమీ వినిపించకోకుండా, తనను కాపాడిన కుక్కను దగ్గరకు తీసుకుని ప్రేమగా నిమురుతూ వుండిపోయాడు.

అది మొదలు ఆ కుక్క వీరభద్రం ఆరో ప్రాణం అయ్యింది. వాడెక్కడ తిరిగినా అంటిపెట్టుకుని వుండేది. అక్కడికి సమీప గ్రామంలో వారం వారం సంత జరిగేది. సంతలో వాడు అంగళ్ళవెంట తిరిగి డబ్బులు వసూలు చేసేవాడు. వాణ్ణి ఎదిరించే ధైర్యం ఎవరికీ వుండేది కాదు. వాడికుక్క అడ్డమైన తిండి తిని పులిలా తయారైంది. అది వీరభద్రం మీద ఈగ వాలనిచ్చేదికాదు. వాడిలో దౌర్జన్య బుద్ధి పెరిగింది. క్రమంగా వాడి సంపాదన కూడా పెరిగింది. కొత్త కొత్త పరిచయాలూ, స్నేహితులూ పెరిగారు. వాడు తాత రాఘవయ్య గురించి దాదాపు మరిచి పోయాడు.

ఒకరోజు వీరభద్రం, రాఘవయ్యకు జబ్బుచేసి మంచానపడ్డాడని తెలిసి చూడటానికి వెళ్ళాడు. రాఘవయ్య, మనవడిని దగ్గరకు తీసుకుని, "నాయనా! నీగురించి నాకు చాలా బెంగగా వుందిరా. ఎలాబతుకుతావో, ఏమిటో!" అన్నాడు.

వీరభద్రం తేలిగ్గా నవ్వేస్తూ, "నా దగ్గర కావాల్సినంత డబ్బుంది. నా గురించి దిగులుపడకు," అన్నాడు.

రాఘవయ్య చిరుకోపంగా, "పిచ్చివాడా! అయాచిత ధనం, అన్యాయార్జిత ధనం అవసరానికి అందిరాదు. మనిషి ముందు మంచితనం సంపాయించాలి. ఆ మంచి

ఒకసారి వీరభద్రం సత్రంలో పడుకుని వుండగా, ఒక సంఘటన జరిగింది. ఎప్పుడో వీరభద్రం చేత తన్నులుతిన్న వాడొకడు, ఎదురుదెబ్బతీయాలని అదనుకోసం చూస్తున్నాడు. వాడికి వీరభద్రం సత్రంలో పడుకున్నాడని తెలిసి, అర్ధరాత్రి వేళ వాడి అంతం చూడాలని వచ్చాడు. కానీ అక్కడ పడుకున్న కుక్కొకటి వాణ్ణి చూసి మొరిగింది. వీరభద్రం తటాలున లేచి, వాడి మీద కలయబడ్డాడు. అయితే, సత్రంలో పడు కునివున్న కొందరు లేచి, వాళ్ళిద్దరినీకొప్పడి పం పేశారు.

మర్నాడు రాఘవయ్యకు సంగతితెలిసి, మనవణ్ణి చూడవచ్చి కంటతడి పెట్టు కున్నాడు. వాడికెన్నో నీతివాక్యాలు చెప్పి, ఇంటికి రమ్మని బతిమాలాడు. కానీ

తనమే ఆ మనిషికి ధనం సంపాదించి పెడుతుంది. అదే మంచి ధనం. మనిషి కేదైనా ఆపద సంభవించినప్పుడు ఆదు కొనడానికి అతనివద్ద మంచితనమైనా వుండాలి, లేదా మంచిగా సంపాదించిన ధనమైనా వుండాలి. అవి రెండూ లేనివాడు తీరని కష్టాల పాలైపోతాడు," అన్నాడు.

వీరభద్రం నిర్లక్ష్యంగా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన కొద్ది రోజులకు వీరభద్రం కుక్క చచ్చిపోయింది. పొరుగూరు నుంచి వచ్చిన సింహంలాంటి కుక్కొకటి, వీరభద్రం కుక్కను చీల్చి చెండాడి దారుణంగా చంపింది.

వీరభద్రానికి రెండు రోజుల పాటు తిండి సహించలేదు. కుక్కచావు వాణ్ణి బాగా కుంగతీసింది. ఆ సమయంలో రాఘవయ్య వెతుక్కుంటూ వాడున్న చోటుకు వచ్చాడు. వీరభద్రం జరిగింది తాతకు చెప్పి, కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

రాఘవయ్య వాడిని ఓదార్చుతూ, "నీ దురాగతాలవల్ల, ఎందరు బాధపడు తున్నారో ఎప్పుడైనా ఆలోచించావా? వాళ్ళల్లో చాలామంది నీ నాశనం కోసం ఎదురు చూస్తూంటారు. నలుగురిని బెదిరించి బతికేవాడు, తనను తాను కాపాడుకునేందుకు క్షణ క్షణం భయ పడుతూ నరకయాతన అనుభవిస్తూంటాడు. అలాంటి వాడు ఎంతకాలం బతగ్గలడు? కండబలం, కాలిబలం వున్నంతవరకు! అవి శాశ్వతం కాదు. ఈ రోజు నీ కుక్క, రేపు నువ్వు," అని వాణ్ణి ఇంటికి తీసుకుపోయాడు.



నాలుగు రోజులపాటు వీరభద్రం ఎక్కడికీ కదలకుండా, ఇంటిపట్టునే వున్నాడు. క్రమంగా తాతచెప్పే హిత వాక్యాల గురించి వాడు మనసులో మథనపడ సాగాడు.

ఒకనాటి సాయంకాలం, రెండు రోజులుగా జ్వరంతోవున్న పక్కింటి సూరయ్య పొలానికి బయలుదేరుతూంటే, అతడి భార్యా, కూతురూ వెళ్ళవద్దని వారిస్తున్నారు. అయినా, చేతికి వచ్చిన పంట, కావలి లేకుంటే దొంగల పాలువు తుందంటున్నాడు సూరయ్య.

ఈ పరిస్థితి చూసి వీరభద్రానికి జాలి కలిగింది. వాడు, సూరయ్యకు బదులు పొలంకాపలాకు తాను వెళతానని సూరయ్యను ఒప్పించి పొలానికి బయలు

దేరాడు. సూరయ్య కూతురు సువర్చల, వీరభద్రం రాత్రి తినడానికి భోజనం కట్టితెచ్చి యిచ్చింది. వీరభద్రంలో వచ్చిన మార్పుకు రాఘవయ్య, సూరయ్య ఎంతో సంతోషించారు.

మరసటిరోజు ఉదయం బారెడు పొద్దెక్కినా వీరభద్రం ఇంటికి తిరిగి రాలేదు. సంగతి కనుక్కుందామని వెళ్ళిన రాఘవయ్యకు, పొలంగట్టున తుప్పల్లో మూలుగుతూ పడివున్న వీరభద్రం కనిపించాడు. అతడి ఒంటి నిండా బలమైన దెబ్బలు! రాఘవయ్య గట్టిగా కేకలు పెట్టి, చుట్టుపక్కల వాళ్ళసాయంతో వీరభద్రాన్ని ఇల్లుచేర్చాడు.

జరిగిందేమంటే – సూరయ్య దూరపు బంధువొకడు, సూరయ్య ఆస్తిమీద ఆశతో, తనకు సువర్చలనిచ్చి పెళ్ళిచేయమని తిరుగుతున్నాడు. దానికి సూరయ్య ఇంట్లోఎవరూఒప్పుకోలేదు. సూరయ్యను అడ్డుతొలగించి, ఆడవాళ్ళనూ ఆస్థినీ దారికి తెచ్చుకోవచ్చనే ఉద్దేశ్యంతో, నలుగురు మనుషుల్ని వెంటబెట్టుకుని, సూరయ్య కావలివుండే పొలానికి వచ్చాడు. తగు జాగ్రత్తలో వున్న వీరభద్రం వాళ్ళతో కలబడ్డాడు. చీకట్లో, ఆ మనిషి సూరయ్య కాదని తెలియటానికి వాళ్ళకు చాలా సమయం పట్టింది. ఈ లోపల వీరభద్రానికి బాగా దెబ్బలు తగలడం జరిగింది.

సూరయ్య చేయించిన వైద్యంతోనూ, సువర్చల చేసిన సపర్యలతోనూ వీరభద్రం త్వరగానే కోలుకున్నాడు. ముఖ్యంగా తన తండ్రిని ముందు ఊహించని విధంగా రక్షించిన వీరభద్రమంటే, సువర్చలకు ఎంతో గౌరవాభిమానం కలిగింది.

ఒకరోజు ఉదయం రాఘవయ్య, వీరభద్రంతో, "ఒరే, నువ్వు అడక్కుండానే సూరయ్యకు సాయం చేయబోయావు. నీ మంచితనానికి ప్రతిఫలం ఏమిటో తెలుసా? తనకున్న ఐదెకరాల ఆస్తిని నీకివ్వటానికి సూరయ్యా, నీకు భార్య కావటానికి సువర్చలా ఒప్పుకున్నారు. నీ మంచితనానికి, మంచిధనంతోపాటు మంచికన్య కూడా లభిస్తున్నది!" అన్నాడు.

ఇది విన్న వీరభద్రం,తనుసోమరితనానికీ, కజ్జాలబతుక్కూ దూరమైన కారణంగా కలిగిన అదృష్టానికి ఎంతగానో సంతోషించాడు.



కావేరీ తీర ప్రయాణం-6

# దేవాలయాలు-స్థలపురాణాలు

రచన: జయంతి మహాలింగం
చిత్రాలు : గౌతం సేన్




సేలంనగరానికి నైరుతీ దిశలో భవాని పట్టణం ఉన్నది. అక్కడి భవానీ నది పేరుమీదుగానే దీనికీ పేరు వచ్చింది. కేరళలోని వళ్ళువనాడు కొండలలో పుట్టి, తమిళనాడు లోని కోయంబత్తూరు, ఈరోడు జిల్లాల గుండా దాదాపు 217 కి.మీ. దూరం ప్రవహిస్తోంది భవానీనది. మార్గ మధ్యంలో సిరువాణి, చిర్టార్, కుణ్ణూర్, కుందా, మోయార్ అనే చిన్న చిన్న ఏరులు ఈ జీవనదిలో కలుస్తు న్నాయి.

భవానీ నది కావేరిలో సంగమించే చోటును పవిత్రంగా భావిస్తారు. రెండు నదులు కలిసేచోట మూడోనది అంతర్వాహినిగా కలుస్తుందని చెప్పే సంప్రదాయం ఇక్కడా ఉన్నది. ఇక్కడ అంతర్వాహినిగా వచ్చి కలిసేది అముదానది. అమృతకలశాన్ని రాక్షసుల నుంచి రక్షించడానికి, పరాశరముని దానిని భవానివద్ద భూమిలో పాతిపెట్టాడు. ఆయన తిరిగివచ్చి చూస్తే, అమృతకలశం పాతిన చోట శివలింగం కనిపించింది. దానిని పైకెత్తడానికి పరాశరముని ప్రయత్నించాడుగాని, కదిలించలేక పోయాడు. లింగం నుంచి బుగ్గలా నీటిధార పైకిఎగిసింది. అదే అముదానది పేరుతో అంతర్వాహినిగా వచ్చి ఈ సంగమంలో కలుస్తున్నదని చెప్పే కథ ప్రచారంలో ఉన్నది.


భవాని సంగమేశ్వర ఆలయం


శివలింగాన్ని పైకెత్తడానికి పరాశరముని ప్రయత్నించాడు

తమిళనాడులోని ప్రసిద్ధమైన దేవాలయాలలో భవాని సంగమేశ్వర ఆలయం ఒకటి. దీనిని దక్షిణ ప్రయాగ, దక్షిణ బదరి, త్రివేణీ సంగమం అని కూడా పిలుస్తారు. శంకరగిరి, తిరుచ్చెంగోడు, పద్మగిరి, మంగళగిరి, వేదగిరి అనే అయిదు గిరిదేవాలయాలతో ఈ ఆలయం పరివేష్టించబడి ఉన్నది. 1900 సంవత్సరారంభంలో ఎడ్మండ్ గ్యారో అనే ఒక బ్రిటిష్ కలెక్టర్, ఈ సంగమ సమీపంలోనిఒక భవనంలో బస చేశాడు. ఒకనాటి అర్ధరాత్రి సమయంలో అతను ఉంటూన్న భవనాన్నీ, దాపుల నున్న పాత కోటనూ హఠాత్తుగా చుట్టుముట్టిన జలప్రవాహం నుంచి అదృష్ట వశాత్తు తప్పించుకున్నాడు. వేదనాయకి మాత అతని కలలో కనిపించి వెల్లువను గురించి హెచ్చరించిందనీ; గ్యారో కృతజ్ఞతతో గుడిలోని దేవతకు ఆభరణాలు, దంతంపల్లకీ కానుకలుగా సమర్పించాడనీ చెబుతారు.

భవానికి దక్షిణంగా ఈరోడు నగరం ఉన్నది. కావేరి నుంచి తవ్వబడిన పెరుంపాళయం, కళింగరాయన్ అనే ప్రధానమైన రెండు కాలువల కారణంగా దీనికీ పేరు వచ్చివుండవచ్చు. 'ఒడై' అంటే తమిళంలో కాలువ అని అర్థం. ఈరోడై (రెండుకాలువలు) ఈరోడు అయివుండవచ్చు, అని చెబుతారు. 'ఈర-ఓడు' అంటే తడిగావున్న కపాలాలు అని అర్థం. దేవీ భాగవతం దక్షయజ్ఞం గురించి చెబుతుంది. దక్ష ప్రజాపతి యజ్ఞం తలపెట్టి, అల్లుడైన శివుణ్ణి అవమానపరచాలని, యజ్ఞానికి అందరినీ పిలిచి, అల్లుణ్ణీ, కూతుర్నీ పిలవలేదు. శివుడు, వారించినా వినకుండా దాక్షాయణి (పార్వతి) తండ్రి చేస్తూన్న యజ్ఞాన్ని చూడడానికి పుట్టింటికి వెళ్ళి, అవమానంపాలై యజ్ఞగుండంలో పడి ఆత్మాహుతి చేసుకున్నది. దాంతో ఆగ్రహం చెందిన శివుడు తన జటాజూటాలను నేలకేసికొట్టి, వీరభద్రుణ్ణీ, భద్రకాళినీ పుట్టించి, యజ్ఞ ధ్వంసానికి పంపాడు. వాళ్ళు యజ్ఞవాటికకు వెళ్ళి, దక్షుణ్ణీ, అతని అనుచరులనూ చంపి నిప్పుల్లో వేసి కాల్చగా మిగిలిన కపాలాలను కావేరిలో పడవేశారు. అవి ఇంకాతడిగానే ఉన్నాయి. ఈ సంఘటన జరిగిన స్థలం ఇది గనక దీనికి 'ఈరోడు' అని పేరు వచ్చిందని ఒక స్థలపురాణం చెబుతుంది.

ఈరోడుకు నైరుతి దిశలో పడమటి కనుమలలో పుట్టే నొయ్యల్ అనే నది కోయంబత్తూరు, తిరుప్పూరు నగరాల గుండా ప్రవహిస్తూ, కరూరు వద్ద కావేరిలో సంగమిస్తున్నది.

తమిళనాడులోని రెండవ అతిపెద్ద నగరం కోయంబత్తూరు. ఈ నగర పరిసరాలలో పరిశ్రమలూ, నేతమిల్లులూ దాదాపు 30,000 దాకా ఉన్నాయి. అందుకే దీనికి 'దక్షిణభారత మాంచెస్టర్' అనే పేరువచ్చింది. కోయంబత్తూరుకు 7కి.మీ. దూరంలో నొయ్యల్ నదీ సమీపంలో వున్న పేరూర్ పట్టీశ్వర

స్వామి ఆలయం ప్రసిద్ధమైన శివాలయం. ఇక్కడి 'కనకసభ'లో కొన్ని అద్భుతమైన శిల్పాలు ఉన్నాయి.

ఈ దేవాలయాన్ని క్రీ.శ ఒకటవ శతాబ్దంలో నిర్మించారని చెబుతారు. ఇందులోని లోపలి గుడిని కరికాల చోళుడు నిర్మించాడు.

కరూరు వద్ద మూడవ ఉపనది అయిన అమరావతీనది కావేరిలో కలుస్తున్నది. ఇది కోయంబత్తూరు జిల్లా అన్నైమలై కొండల్లో పుట్టి 200 కి.మీ. కన్నా ఎక్కువ దూరం ప్రవహిస్తున్నది. దీనికి అడ్డుగా నిర్మించిన అనేక ఆనకట్టలు వ్యవసాయానికి కావలసిన జలాలను సరఫరా చేస్తున్నాయి. ఈ సంగమం నుంచి బయలుదేరే ఉయ్యకొండాన్ కాలువ తిరుచ్చికి కూడా నీటి సరఫరా చేస్తోంది.

ప్రాచీన కాలంలో చేర, చోళ, పాండ్య రాజ్యాలమధ్య కావేరి, అమరావతీ నదులు సహజ సరి హద్దులుగా ఉండేవి. ఏవైనా ముఖ్యమైన పనులు ఆరంభించే ముందు ముగ్గురు రాజులూ సంగమం వద్ద వున్న చెల్లాండి అమ్మన్‌కు ప్రత్యేక పూజలు జరిపి ప్రార్థించేవారు. ఇక్కడొక అగస్త్యముని ఆలయంకూడా ఉన్నది. కంచి మఠానికి చెందిన ఆచార్య పరమశివేంద్రసరస్వతి శిష్యుడూ, భక్తకవీ, యోగీ అయిన సదాశివ బ్రహ్మేంద్రులవారి సమాధి ఇక్కడికి సమీపంలోని నేరూర్‌లో ఉన్నది. ఆయన జీవితంలో జరిగిన ఒక వింత ఉదంతాన్ని ఇంకా చెప్పుకుంటారు. ఆయన ఒకప్పుడు కావేరి తీరంలోని కొడిముడి వద్ద కూర్చుని ధ్యాననిమగ్నుడై ఉండగా, హఠాత్తుగా వెల్లువ వచ్చి ఆయన్ను ఇసుకతో కప్పివేసిందట. ఆ తరవాత కొందరు ఇసుకదిబ్బను తవ్వగా అందులోనుంచి పైకిలేచిన సదాశివ బ్రహ్మేంద్రులు, ఏమీ జరగనట్టు ఇసుకను దులుపుకుని చకచకా నడిచి వెళ్ళారట! కావేరీనది తిరువయ్యారు వద్ద త్యాగరాజ కీర్తనలతో మారుమోగినట్టే, నేరూరులో సదాశివబ్రహ్మేంద్రుల కీర్తనలతో ప్రతిధ్వనిస్తోందని చెబుతారు!

మేట్టూరు నుంచి తిరుచిరాపల్లి వరకు ఉన్న ప్రాంతాన్ని తమిళనాడులో అత్యధికంగా పారిశ్రామికీకరణ జరిగిన ప్రాంతంగా చెప్పవచ్చు. మేట్టూరు, భవాని ఆనకట్టలకు లోబడిన ప్రాంతాలలోనూ; కావేరీతీరం పొడవునా; భవాని, అమరావతి, నొయ్యల్ నదీ తీరాల లోనూ అసంఖ్యాకమైన



కొడుముడిలోని దేవాలయం

**కలుషిత మవుతూన్న నదీ జలాలు :**



తిరుప్పూరు సమీపంలో కలుషితమైన నొయ్యల్ నది

పరిశ్రమలు నెలకొల్ప బడ్డాయి. ఉద్యోగావకాశాలు పెరగుతాయి కాబట్టి, ఈ పరిశ్రమల వల్ల ప్రజలకెంతో మేలు జరుగుతుందన్నది నిజమే. అయితే, ఈ పరిశ్రమల కారణంగా ఈ నదులు క్రమేణా మురుగుకాల్వలుగా మారిపోతున్నాయి. మేట్టూరు, భవాని, ఈరోడు, కోయంబత్తూరు, తిరుప్పూరు మొదలైన నగరాల చుట్టూ వున్న పరిశ్రమల నుంచి వెలువడే మిగులు మురికి నీళ్ళూ, విషపూరిత రసాయనిక పదార్థాలూ, శుభ్రపరచకుండా నదులలోకి వదల బడుతున్నాయి. ఇవి పైరుపచ్చలకూ, ప్రజల ఆరోగ్యానికీ చెప్పరాని హాని కలిగిస్తున్నాయి.

పరిశ్రమల నుంచి భవానీ నదిలోకి వదలబడే మురికినీళ్ళు మరీ విషపూరితం కావడంతో ఇక్కడి వేరుశనగ, వరి, చెరకు పంటలు దారుణంగా దెబ్బతిన్నాయి. ఒకప్పుడుభవానీసాగర్‌లో చేపలు విరివిగా లభించేవి. ఇప్పుడు అంతగా దొరకడంలేదు. కొన్ని జాతుల చేపలు నశించి పోయాయి. ఈ నీళ్ళు తాగే ప్రజలు రకరకాల శ్వాసకోశవ్యాధులకూ, ఉదరవ్యాధులకూ గురవుతున్నారు.

రోజురోజుకూ పెరిగిపోతూన్న ఈ వాతావరణకాలుష్యాన్ని అరికట్టాలని 1993 వ సంIIలో ఒక ఉద్యమం బయలుదేరింది. వాటి ఫలితంగా పరిశ్రమల నుంచి విడుదలయ్యే కలుషిత పదార్థాలలోని విషపదార్థలను తొలగించే యంత్రాలను అమర్చి, వాటిని తొలగించాకే, ఆ నీళ్ళను నదిలోకి వదలాలనీ; లేకుంటే పరిశ్రమలను మూసివేయాలనీ కోర్టులు ఆదేశాలను జారీచేశాయి.

అదే విధంగా నొయ్యల్ కూడా 'మృతనది' గా మారిపోతున్నది. నొయ్యల్ నది పొడవు 173 కి.మీ. కోయంబత్తూరు, తిరుప్పూరు నగరాలలో 800 పైగా పరిశ్రమలు ఉన్నాయి. ఇవన్నీ బట్టలకు రంగులు వేయడం, బ్లీచింగ్ చేయడం వంటివి చేసేవే. వీటినుంచి వెలువడే మురికి, రసాయనిక పదార్థాలు ఈ నదిలో కలుస్తున్నాయి. వ్యవసాయ భూములకు సాగునీటి జలాలు అందించాలని 1992వ సంIIలో నొయ్యల్ నదిమీద ఒరత్తపాళయం ఆనకట్ట నిర్మించారు. అయినప్పటికీ ఈ నదీ జలాలు కలుషితం కావడం వల్ల కరూరు ప్రాంతం రైతులు వాటిని ఉపయోగించుకోలేని దుస్థితిలో వున్నారు. అందువల్ల బట్టల ఎగుమతుల ద్వారా యేటా 2000 కోట్లు ఆర్జిస్తూన్న తిరుప్పూరు పరిశ్రమలు వాటి నుంచి వెలువడే నీటినీ, రిజర్వాయర్ అంతర్భాగాన్నీ శుభ్రపరచాలనీ; 1998 ఆఖరులోగా విష పదార్థాలను వేరుచేసి తొలగించే ఉమ్మడియంత్రాన్ని నెలకొల్పాలనీ కోర్టులు ఆదేశాలను జారీ చేశాయి.



ఈరోడు సమీపంలో కావేరిలోకి ప్రవహిస్తూన్న మిగులు మురికి నీరు



# శరభయ్య తెలివి

ఒక ఊళ్ళో శరభయ్య, చలమయ్య అనే మిత్రులున్నారు. ఇద్దరూ చాలా పనులు కలిసే చేస్తారు. కానీ అందరూ శరభయ్య తెలివిని మెచ్చుకుంటారు. చలమయ్యను చేతకానివాడంటారు. ఇది చలమయ్యకు చాలా బాధగా వుండేది. అయితే, శరభయ్య మిత్రుడిని ఓదార్చుతూ, "ఇతరులు ఏమన్నారన్న దాన్నిగురించి ఆలోచించకు. నీ గురించి నీకు తృప్తిగా వుంటే సంతోష పడు," అని సలహా ఇచ్చేవాడు.

ఒకరోజున మిత్రులిద్దరూ పట్నం బయల్దేరారు. తమ భార్యలకు బంగారు గొలుసులు కొనాలని వాళ్ళ తాపత్రయం.

ఇద్దరూ కొంత దూరం వెళ్ళే సరికి, ఒక చెట్టు కింద వారికిద్దరు బాటసారులు కూర్చుని గట్టిగా మాట్లాడుకోవడం విని పించింది. మిత్రులిద్దరూ బాటసారుల వద్దకు వెళ్ళి, విషయమేమిటని అడిగారు. వారిలో ఒకడు విలువైన దుస్తులు ధరించి వున్నాడు. ఆయన వ్యాపారాలు చేసి కోట్లు ఆర్జించాడు. ఆయనకిద్దరు కూతుళ్ళు. ఇద్దరికీ ఒకేసారి ఏదో వింత జబ్బు చేసింది. వైద్యులు ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఆ జబ్బు లొంగలేదు. చివరికొక సాధువు వాళ్ళను పరీక్షించి, తండ్రితో, "నీ పాపాలు వీళ్ళను బాధపెడుతున్నాయి. కొంతకాలం పాటు వీళ్ళకు రోజుకొక బంగారు గొలుసు చొప్పున చేయించు. రోజుకొక కొత్త ప్రాంతానికి వెళ్ళి, ఆ గొలుసుల్ని సగం ధరకు అమ్ము. పది రోజుల్లో నీ కూతుళ్ళకు పూర్ణారోగ్యం చేకూరుతుంది!" అని చెప్పాడు.

ఆ ప్రకారం ఆయన ఇక్కడకు వచ్చి, ఈ చెట్టు కింద ఆగాడు. రెండో అతను స్వర్ణకారుడు. వ్యాపారస్థుడి కథ విని, ఆ గొలుసులు పరీక్షించాడు. అవి బంగారానివే



అని రూఢి చేసుకున్నాక, తనే వాటిని కొందామనుకున్నాడు. అయితే అతడి వద్ద అయిదు వందలరూపాయలు మాత్రమే వున్నాయి. మిగతా డబ్బు తన ఊరికి వస్తే ఇస్తానంటున్నాడు. లేదా తన వేలి ఉంగరం తీసుకోమంటున్నాడు.

"అయ్యా! రాత్రికల్లా నేను నా ఊరు చేరుకోవాలి. నాఊరిదొక దారి; ఈయన దింకోదారి. కాబట్టి అలా కుదరదు. ఈయన స్వర్ణకారుడు కాబట్టి, నా బంగారం మంచిదని తెలుసుకోగలిగాడు. కానీ ఇతడి వేలి ఉంగరం బంగారమవునో కాదో నాకెలా తెలుస్తుంది? ఇప్పటికే నా కూతుళ్ళ ఆరోగ్యం కోసం, వెయ్యి రూపాయల గొలుసును అయిదొందల కిస్తున్నాను. అంతకు తగ్గించలేను. ఈయన వద్ద అయిదొందలే వుంటే, ఒక్క గొలుసే తీసుకోమన్నాను. అది న్యాయమే కదా?" అన్నాడు వ్యాపారస్థుడు.

స్వర్ణకారుడు చిరాగ్గా, "ఇది మనిద్దరి మధ్య విషయం.ఇందులో మూడో మనిషి జోక్యమెందుకు?" అన్నాడు.

అప్పుడు చలమయ్య వెంటనే, "అయ్యా! మేమిద్దరం బంగారు గొలుసులు కొందా మనే, పట్నం బయల్దేరాం. మేమిద్దరం ఏ పని చేసినా కలిసి చేస్తాం. తమరు ఈ రెండు గొలుసుల్నీ, మా ఇద్దరికే ఇస్తే తగిన మూల్యం ఇచ్చి, ఇక్కణ్ణించే వెనక్కు తిరిగి పోతాం," అన్నాడు.

"ఇది అన్యాయం! నాకు ఒక్క గొలుసైనా ఇచ్చితీరాల్సిందే," అన్నాడు స్వర్ణకారుడు వెంటనే.

వ్యాపారస్థుడు మాత్రం అంతవరకూ తనను వేధించాడన్న కోపంతో, స్వర్ణకారుడికి గొలుసు ఇవ్వనన్నాడు. శరభయ్య, చలమయ్య చెరో అయిదొందలూ ఇచ్చు కుని, గొలుసులు తీసుకుని, తమ ఊరు తిరిగి వెళ్ళారు. బంగారాన్ని చౌకగా కొన్నందుకు ఇద్దరికీ సంతోషంగా వుంది. గొలుసు నాణ్యతపై ఇద్దరికీ సందేహం లేనప్పటికీ, ఎందుకైనా మంచిదని ఇళ్ళు చేరేముందు, ఆ గొలుసుల్ని ఊళ్ళోని స్వర్ణకారుడికి చూపించారు.

స్వర్ణకారుడు గొలుసుల్ని పరీక్ష చేసి, "ఇది నకిలీబంగారం. గొలుసు పాతిక రూపాయల విలువకూడా చెయ్యదు. మీరు కొని హెచ్చుధర పెట్టలేదు కదా!" అన్నాడు.

"మరీ హెచ్చు ధర పెట్టలేదు కానీ, పాతిక రూపాయల కంటే చాలా ఎక్కువే ఇచ్చాం," అన్నాడు శరభయ్య.

ఇద్దరూ తమ గొలుసులు తీసుకుని, ఇళ్ళకు బయల్దేరారు.

ముందు శరభయ్య ఇల్లు వచ్చింది. అతడు భార్యకు జరిగింది చెబితే, "అవతల వాళ్ళంత పకడ్బందీగా పథకం వేసి మోస గిస్తారని, ఎవరైనా కలగంటారా? ఒకవేళ ఆయన నిజంగానే మంచి బంగారం అమ్మితే, చక్కటి అవకాశం చేజారిపోయేది కదా! తెలివిగలవాళ్ళు మంచి అవకాశాన్ని వదులుకోరు. నువ్వు చాలా తెలివైనవాడివి. అదృష్టం మనకు కలిసి రాలేదంతే!" అని భర్తను పొగిడింది.



ఈ మాటలు వినగానే చలమయ్యకు కొంత ఊరట కలిగి, చలాకీగా ఇంటికి వెళ్ళాడు. కానీ అతడి భార్య జరిగింది విని నానాతిట్లూ తిట్టి, "నీ తెలివి ఇలా తెల్లారు తుందని తెలిసీ, నేను కూడా రాక పోతిని. తప్పు నాదేలే!" అన్నది.

ఆ తరువాత – అసలు బంగారాన్ని సగం ధరకు అమ్మేవాడు ఉంటాడని ఎలా నమ్మావని, భర్తను నిలదీసింది. శరభయ్య కూడా నమ్మాడంటే, అతడు కూడా ఈ మోసంలో భాగస్వామి అని ఆరోపించిందామె.

చలమయ్య మనసులో, "శరభయ్య అదృష్టవంతుడు. మోసపోతే, అతడి భార్య అదీ తెలివే అంది. నా భార్య కూడా అతణ్ణి తెలివితక్కువవాడనలేదు. మోసగాడే అయివుంటాడంటున్నది. నన్ను మాత్రం నిస్సందేహంగా తెలివితక్కువ వాడని తిట్టింది. నేను చాలా దురదృష్టవంతుణ్ణి!" అని బాధపడుతూ, ఇంట్లో ఒక మూల గదిలో కూర్చుని కుమిలిపోసాగాడు.

ఈలోగా శరభయ్య తన బుర్రకు పదును పెట్ట సాగాడు. తను సులువుగా మోసపోయాడు. అయినా, భార్య తన తెలివిని మెచ్చుకుంది. కాబట్టి ఇప్పుడు పోగొట్టు కున్న డబ్బును తిరిగి సంపాదించుకోవాలి!

బాగా ఆలోచించగా శరభయ్యకు, ఒక విషయం గుర్తుకొచ్చింది. తాము పట్నానికి బంగారు గొలుసులు కొనడానికి వెళు తున్నామన్న విషయం ఊళ్ళో ఎవరికీ తెలియదు – ఒక్క కొండయ్యకు తప్ప! వాడామధ్య కూతురు పెళ్ళి చేసినప్పుడు పట్నంలో బంగారు గొలుసు కొన్నాడు.

ఎక్కడ నమ్మకంగా గొలుసులు దొరుకుతవని, వాణ్ణి నిన్న తనూ, చలమయ్యా అడిగారు.

అదలా వుంచితే – తమక్కావలసినవి రెండు బంగారు గొలుసులు. మోసగాళ్ళ వద్ద వున్నవీ సరిగ్గా రెండే బంగారు గొలుసులు! అంటే, కొండయ్యే ఈనాటకానికి ఏర్పాటు చేయించి వుండాలి. కొండయ్య మోసగాడని ఉళ్ళో చెప్పుకుంటారు.

ఈ విధంగా ఆలోచించి శరభయ్య గ్రామాధికారి వద్దకు వెళ్ళి జరిగిందంతా చెప్పి, తన అనుమానం గురించి వివరించాడు. గ్రామాధికారి కూడా చాలాకాలం కొండయ్య బండారం బయట పెట్టాలని ఆలోచిస్తున్నాడేమో – శరభయ్య ఆలోచనలను మెచ్చుకున్నాడు.

ఆయన ఇద్దరు మనుషుల్ని మారు వేషాలలో కొండయ్యను అనుసరించమని నియమించాడు. ఆ రాత్రే కొండయ్య పొరుగూరు వెళ్ళి, తన భాగస్వాములతో డబ్బు పంపకం చేసుకుంటూ, గ్రామాధికారి మనుషులకు దొరికిపోయాడు.

కొండయ్య తనను క్షమించమంటూ గ్రామాధికారి కాళ్ళ మీద పడ్డాడు. శరభయ్య చలమయ్యలకు పోగొట్టుకున్న డబ్బుతిరిగొచ్చింది. ఇద్దరూ సంతోషంగా తమ తమ ఇళ్ళకు బయల్దేరారు.

ముందుగా శరభయ్య ఇల్లు వచ్చింది. జరిగింది తెలుసుకున్న అతడి భార్య, "తెలివంటే నీదే తెలివి. దొంగ కాజేసిన సొమ్మును తిరిగి తెచ్చుకున్నావు," అంటూ పొగిడింది.

పొగిడే పెళ్ళాముంటేనే మగాడి తెలివి రాణిస్తుందని భార్యకు గట్టిగా చెప్పాలని ఇల్లు చేరిన చలమయ్యతో, అతడి భార్య, "జరిగిందంతా విన్నాను. పెళ్ళాం, తెలివిని పొగిడితే, ఇంకా తెలివిని పెంచుకోవాలని ప్రయత్నించాడు, శరభయ్య. నేనొక మాటంటే కూడా పౌరషం తెచ్చుకుని మోసానికి విరుగుడు వేయడానికి బదులు, తిట్టానని బాధపడుతూ మూలకూర్చున్నావు నువ్వు. నీ తెలివి ఈ జన్మకింతే!" అంటూ ఈసడించింది.

ఈసారి చలమయ్యకు కోపం రాలేదు. మనసులో బాధ పుట్టలేదు. "నా పెళ్ళాం నిజమే చెప్పింది! నేను శరభయ్య నుంచి చాలా నేర్చుకోవాలి," అనుకున్నాడు.





# వింతపరీక్ష!

ఒకానొకప్పుడు వీరసేనుడనే రాజు వివేకి అయిన వృద్ధ మంత్రి ధర్మసాగరుడి సలహా ప్రకారం వీరపురిని చక్కగా పాలిస్తూ వచ్చాడు. ఒకనాడు వృద్ధమంత్రి, తనకు యేళ్ళు పైబడినందున మంత్రి పదవిని విరమించి, శేషజీవితాన్ని ప్రశాంతంగా గడపాలన్న కోరికను రాజుకు తెలియ జేశాడు. దానికి రాజు, "అలాగే, మంత్రి వర్యా! తమ ముగ్గురు కుమారులలో ఒకరిని, అంటే తమ జ్యేష్ఠకుమారుణ్ణి తమ స్థానంలో మంత్రిగా నియమించు కుంటాను. తమకు అభ్యంతరం లేదు కదా?" అని అడిగాడు.

"అభ్యంతరం లేదుగాని, నాముగ్గురి కుమారులలో ఎవరిని మంత్రిగా నియ మించాలన్నది తమరు బాగా ఆలోచించి నిర్ణయం తీసుకోవడం మంచిది. ధైర్య వంతుడు మంత్రిగా కావాలనుకున్నట్టయితే మీ ఇష్టానుసారం మీరన్నట్టుగా పెద్ద కుమారుణ్ణే నియమించవచ్చు. కీలకమైన ఆ పదవిలో తెలివైనవాణ్ణి నియమించా లనుకుంటే రెండవవాడే తగినవాడు. నిజాయితీపరుడే ఆ పదవికి అర్హుడు అని తమరు భావించినట్టయితే ఆఖరివాడే అందుకు అర్హుడు!" అన్నాడు మంత్రి.

"తమ కుమారుల స్వభావం గురించి అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలుగుతు న్నారు? ఆ అభిప్రాయం నిజమని తమరు నిరూపించగలరా?" అనిఅడిగాడు రాజు.

"తప్పకుండా, ప్రభూ!" అని మంత్రి కొంతసేపు ఆలోచించి, "నేను ముగ్గురికీ ఒక సూచన ఇస్తాను. దానిని ఎవరు ఎలా పాటిస్తారో తమరే చూడండి!" అన్నాడు.

మరునాడు మంత్రి తన ముగ్గురు కుమారులనూ పిలిపించి, "నాయనలారా! మీతో ఒక ముఖ్యమైన పనివుంది. నా మాటలు జాగ్రత్తగా వినండి. రాజోద్యానం మధ్యలో మహత్తుగల గులాబీ మొక్క

ఒకటి ఉన్నది. మీరు వెళ్ళి, ఆ మొక్క నుంచి తలా ఒక పువ్వును కోసుకుని రావాలి. ఇది ప్రమాదంతో కూడుకున్నపని. ఎందుకంటే – ఆ మొక్కనుంచి పువ్వులు కోయడం పూర్తిగా నిషిద్ధం. ఒకవేళ మీరు పువ్వులు కోస్తూ కాపలాభటులకు పట్టుబడినట్టయితే మీ నోటిని ఉపయోగించి శిక్ష నుంచి తప్పించుకోవచ్చు. నోటిని మాత్రమే ఉపయోగించాలన్న విషయం గుర్తుంచుకోండి!" అని చెప్పాడు.

ముగ్గురు కొడుకులూ సరేనని, తండ్రికి నమస్కరించి అక్కడి నుంచి బయలుదేరారు.రాజు ఈ తతంగాన్నంతా చాటు నుంచి గమనించాడు.

అప్పటికి సాయంకాలమయింది. ముగ్గురూ రహస్యంగా ఉద్యానంలోకి జొరబడి తండ్రి చెప్పిన గులాబీమొక్కను సమీపించారు. కాని పువ్వులు కోసిన మరుక్షణమే కాపలాభటులు వచ్చి వాళ్ళను పట్టుకున్నారు. పెద్దకుమారుడు గట్టిగా కేక పెట్టి తనచేయి పట్టుకున్న కాపలాభటుడి చేతిని కరిచాడు. భటుడు భయపడి చేయివదిలాడు. అదే అదనుగా మంత్రి కొడుకు తప్పించుకున్నాడు.

రెండవ కుమారుడు పువ్వును నోట్లో వేసుకుని ఏమీ ఎరగనట్టు అమాయకతను నటించి బయటపడ్డాడు.

అయితే, మూడవవాడు మాత్రం ప్రశాంతంగా అలాగే నిలడ్డాడు. కాపలా భటులు అతన్ని రాజు సమక్షానికి తీసుకు వెళ్ళారు. అతడు రాజుకు నమస్కరించి, "ప్రభూ! ఆ మొక్క పూవులు కోయడం నిషిద్ధమని నాకు తెలుసు. అయితే, నన్ను ఆ పనిచేయమన్నది పరమ వివేకి అయిన తమ మంత్రి. ఆయన అలా చెప్పడానికి బలమైనకారణం ఏదోవుంటుంది!" అని చెప్పాడు.

అంతలో అక్కడికి వచ్చిన మంత్రి, "చూశారా, ప్రభూ! ముగ్గురూ నేను చెప్పినట్టే నోటిని మాత్రమే ఉపయోగించారు. అయితే, వారిస్వభావానికి తగ్గట్టు ప్రవర్తించారు. ఒకడు దానిని హింసకు ఉపయోగిస్తే, మరొకడు తెలివిగా ఉపయోగించాడు. ఇంకొకడు నిజాయితీగా ఉపయోగించుకున్నాడు," అన్నాడు.

రాజు సంతోషంగా మందహాసం చేసి, "అవును, మంత్రివర్యా! అయినా, తమ కుమారులు ముగ్గురూ మూడు విధాలుగా గొప్పవారే. తమ పెద్ద కుమారుణ్ణి సైనికాధికారిగా నియమిస్తున్నాను. రెండవ కుమారుణ్ణి నా సలహాదారుగా తీసుకుంటాను. వివేకీ, నిజాయితీపరుడూ అయిన మీ చిన్న కుమారుడే, మీ స్థానానికి, అంటే మంత్రి పదవికి తగినవాడు!" అన్నాడు.



50. యుద్ధసన్నాహం

# మహాభారతం

కృష్ణుడు ప్రసాదించిన దివ్యదృష్టితో ధృతరాష్ట్రుడు విశ్వరూపాన్ని ఆశగా చూశాడు. తరవాత ఆయన కృష్ణుడితో, "భగవంతుడా, ఎంతో దయతో నువ్వు నాకు దివ్యనేత్రాలు ఇచ్చావు. వీటిని మళ్ళీ నువ్వే తీసుకో. నీ రూపాన్నిచూసినకళ్ళతోమామూలుమనుషులనూ, ప్రపంచాన్నీ చూడలేను," అన్నాడు.

మరుక్షణం సభ ఎప్పటిలాగే ఉన్నది. కృష్ణుడు మామూలుగానే ఉన్నాడు. నారదుడు మొదలైన దేవర్షులు సభలో లేరు. కృష్ణుడు సభలోని ఋషులతో వస్తానని చెప్పి, ఒక చెయ్యి సాత్యకికీ, రెండో చెయ్యి విదురుడికీ ఇచ్చి, సభ నుంచి బయలుదేరాడు. అతని వెంట కౌరవులూ, మిగిలిన రాజులూ బయలు దేరారు. చాలా కోపంగా ఉన్న కృష్ణుడు వారి వంక చూడనైనా లేదు.

ద్వారం వద్ద దారుకుడు రథంతోసహా సిద్ధంగా ఉన్నాడు. కృష్ణుడు రథంలో ఎక్కి కూర్చోగానే ధృతరాష్ట్రుడు అతనితో, "కృష్ణా, నన్ను నువ్వు అపార్థం చేసుకోవద్దు. పాండవులపట్లనాకు ఎలాటి దురద్దేశమూ లేదు. నేను దుర్యోధనుడికి చెప్పినహితం నువ్వు విన్నావు. సభలో అందరూ విన్నారు గదా!" అన్నాడు.

కృష్ణుడు ధృతరాష్ట్రుణ్ణీ, భీష్మ, ద్రోణ, బాహ్లీక, కృపులలాటి పెద్దలనూ ఉద్దేశించి, "మహాత్ములారా, సభలో జరిగినదంతా మీరు చూశారు. దుర్యోధనుడు రోషంతో సభనుంచి లేచిపోయాడు. ధృతరాష్ట్రుడు తాను అసమర్థుణ్ణి అని అన్నాడు. నేను వచ్చిన పని ముగిసింది, వెళుతున్నాను. నాకు సెలవు ఇప్పించండి," అన్నాడు గంభీరంగా.






పెద్దలందరూ కృష్ణుడికి వీడ్కోలు చెప్పి తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. కృష్ణుడు రథం మీద తన మేనత్త అయిన కుంతి ఇంటికి వెళ్ళాడు. అతను కుంతీదేవికి కౌరవసభలో జరిగినదంతా చెప్పి, "దేవీ, ఎందరు ఎన్నివిధాల చెప్పినా, దుర్యోధనుడు వినిపించుకో లేదు. రాజలోకానికి కాలం మూడింది. అర్జునుడు వాళ్ళను కార్చిచ్చు లాగా దహిస్తాడు. నేను పాండవుల దగ్గరికి పోతున్నాను. వారికి ఏమన్నా సందేశం ఇస్తావా?" అని అడిగాడు.

"నాయనా, ధర్మానికి భంగం రానివ్వ వద్దని ధర్మరాజుతో చెప్పు. క్షత్రియులు బాహుబలంతో జీవించటం ధర్మం. అందు కోసం హింస చెయ్యవలసి వస్తే అది విధి నిర్ణయమన్న మాట. పూర్వం కుబేరుడు ముచికుందుడనే రాజర్షికి భూమండల మంతా ఇస్తానంటే ముచికుందుడు తీసుకోక, తన భుజబలంతో సంపాదించు కున్న రాజ్యమే తనకు కావాలన్నాడట. ధర్మరాజు ఇప్పుడనుసరించే మార్గం నాకు నచ్చినది కాదు. అది పాండురాజుగాని, భీష్ముడుగాని ఆమోదించేది కూడా కాదు. అతనికి నిత్యమూ యజ్ఞ దాన తపస్సులూ, శౌర్యప్రజ్ఞలూ, బలమూ, ఓజస్సూ ఉండా లని నేను దీవించినట్టు చెప్పు. రాజ్య పాలన ధర్మబద్ధంగా చెయ్యటం ఉత్తమ క్షత్రియ లక్షణం; భిక్షాటనమూ, వ్యవ సాయమూ, వాణిజ్యమూ పనికిరావు. పాండవులు తమ తండ్రి రాజ్యభాగాన్ని తాము రాబట్టుకోవాలి. నాకు పరుల అండన బతకటం కంటే దుఃఖం ఏమి ఉంటుంది? యుద్ధంతో తండ్రి తాతలకు ఉత్తమలోకాలు కలిగించమని ధర్మరాజుతో చెప్పు," అన్నది కుంతి కృష్ణుడితో.

ఆమె కృష్ణుడికి వీడ్కోలు చెబుతూ తాను తన కొడుకులనూ, కోడలినీ అడిగి నట్లు చెప్పమన్నది.

కృష్ణుడు కుంతి మందిరం నుంచి బయలుదేరి, కౌరవ ముఖ్యులందరికీ వీడ్కోలు చెప్పి, సాత్యకితోపాటు కర్ణుణ్ణీ కూడా తన రథం మీద ఎక్కించుకుని బయలుదేరాడు. రథం నగరం దాటి నిర్జన మైన ప్రదేశం చేరగానే, కృష్ణుడు కర్ణుడితో ఏకాంతంగా, "కర్ణా, నువ్వు వేదాలూ, ధర్మ శాస్త్రాలూ చదువుకున్న వాడివి. అందుచేత నువ్వు గ్రహించగలవు. కన్యగా ఉండగా స్త్రీకి పుట్టిన వాణ్ణి కానీనుడు అంటారు.

అలాంటి కన్యఎవరిని వివాహం చేసుకుంటే వాడే కానీనుడికి తండ్రి అవుతాడు. నువ్వు కుంతీదేవికి కానీనుడుగా పుట్టిన వాడివి. అందుచేత పాండురాజు పెద్దకొడుకువు; ధర్మశాస్త్రాల ప్రకారం రాజు కావలిసిన వాడివి. నీకు తండ్రి పక్షాన పాండవులూ, తల్లి పక్షాన వృష్ణివంశం వాళ్ళూ బంధువులు. నావెంట వచ్చావంటే పాండవులూ, వాళ్ళ కొడుకులూ, పాండవుల పక్షాన వచ్చిన రాజులూ నీ పాదాలకు నమస్కరించుతారు. నీకు పట్టాభిషేకం జరుగుతుంది. ద్రౌపది నిన్ను ఆరవ భర్తగా స్వీకరిస్తుంది. ధర్మరాజు నీకుయువరాజుగా ఉంటాడు," అని చెప్పాడు.



దానికి కర్ణుడు, "కృష్ణా, నా మీద ప్రేమ తోనూ, స్నేహంతోనూ నువ్వు చెప్పినదంతా విన్నాను. నేను పాండురాజు కొడుకునన టానికి సందేహంలేదు. కుంతీదేవి నన్ను కని నదిలోపారేస్తే, అధిరథుడనే సూతుడు నన్ను చూసి తెచ్చి తన భార్య అయిన రాధకు ఇచ్చాడు. నన్ను అష్టకష్టాలు పడి పెంచిన ఆ దంపతులకు పిండాలు పెట్టటం నా ధర్మం కాదా? నాకు వాళ్ళే నామకరణం చేసి వసుషేణుడని పేరు పెట్టారు. ఇతర సంస్కారాలన్నీ చేశారు. వాళ్ళ బంధువుల పిల్లలనే నేను పెళ్ళాడాను. నాకువారియందుకొడుకులూ, మనమలూ కూడా కలిగి పెరుగుతున్నారు. పదమూడే ళ్ళుగా ధృతరాష్ట్రుడి ఇంట, దుర్యోధనుడి అండన రాజ్యభోగాలు అనుభవిస్తున్నాను. నన్ను చూసుకుని దుర్యోధనుడు పాండవు లతో యుద్ధానికి సిద్ధపడ్డాడు. అర్జునుడితో ద్వంద్వయుద్ధం చెయ్యమని అతను నన్ను కోరాడు. భయంచేత గాని, లాభం చేత గాని నేను దుర్యోధనుడికి అన్యాయం చెయ్యను. నేను అర్జునుడితో యుద్ధం చెయ్యకపోతే మా ఇద్దరికీ అపకీర్తి తప్పదు. నీ సహాయంతో పాండవులు తప్పక జయిస్తారు. నేను తన అన్ననని తెలిస్తే ధర్మరాజు రాజ్యం కోరడు. నేనేమో ప్రపంచ మంతా జయించినా ఆ రాజ్యాన్ని దుర్యో ధనుడికే ఇస్తాను. భూమినంతా ధర్మరాజునే ఏలుకోనియ్యి. దుర్యోధనుణ్ణి సంతోష పెట్టాటానికి పాండవులను గురించి చాలా హీనంగా మాట్లాడాను. నేను చెప్పినట్టు ఎవరికీ చెప్పక, అర్జునుణ్ణి యుద్ధానికి సిద్ధుణ్ణి చెయ్యి," అన్నాడు.

కృష్ణుడు నవ్వి, "నీకు రాజ్యకాంక్ష లేదన్నమాట. సరే, ఈ మాసం యుద్ధానికి



బాగున్నది. ఇంకా వారం రోజులకు అమావాస్య వస్తుంది. ఆ రోజున యుద్ధం ప్రారంభమయ్యేటట్టు చూడమని భీష్మ, ద్రోణ, కృపులతో చెప్పు. నువ్వు కూడా యుద్ధానికి సిద్ధంకా," అన్నాడు.

కర్ణుడు కృష్ణుణ్ణి కౌగలించుకుని, సెలవు పుచ్చుకుని, తన రథంమీద ఇంటికి వెళ్ళాడు. కృష్ణుడు సాత్యకితో సహా తన రథంలో ఉపప్లావ్యానికి బయలుదేరాడు.

కృష్ణుడు తాను చేసిన కృషి ఫలించక తిరిగివెళ్ళగానే విదురుడు కుంతీదేవి వద్దకు వచ్చి, "నేను ఏది వద్దు అను కున్నానో అదే జరగబోతున్నది. పాండవ కౌరవులు మహా యుద్ధంలో అనేక లక్షల ప్రాణాలను బలి పెట్టబోతున్నారు. కృష్ణుడు సంధి కుదర్చలేక తిరిగి వెళ్ళాడు," అని దుఃఖించాడు.

కుంతీదేవికి కూడా, యుద్ధంలో భీష్మ ద్రోణుల వంటి మహాపురుషులు చావటం భయంకరంగా తోచింది; తన కొడుకులు యుద్ధంలో జ్ఞాతులను చంపి విజయం పొందటం కన్న దారిద్ర్యంతో మాడి చావటమే మేలేమోననిపించింది. రానున్న ఆపదకు మూలకారకుడు కర్ణుడేనని, అతను తన కొడుకులను ద్వేషిస్తూ, వారిని చంపటానికి నిశ్చయించుకున్నాడనీ ఆమె అనుకున్నది. అందుచేత ఆమె కర్ణుడి మనసు పాండవులకు అనుకూలంగా మార్చటానికి నిశ్చయించుకుని, గంగా తీరాన కర్ణుడు జపం చేసుకుంటున్న చోటికి వెళ్ళింది. కర్ణుడు తూర్పుగా తిరిగి, చేతులెత్తి జపం చేసుకుంటున్నాడు. కుంతి అతని వెనకగా వచ్చి, ఎండదెబ్బకు వడలి, కర్ణుడి పైబట్ట మీద కూర్చున్నది.

కర్ణుడు జపం చాలించి, కుంతిని చూసి నమస్కారం చేసి, "అమ్మా, కర్ణుణ్ణి, నమస్కారం చేస్తున్నాను. ఏ పనిమీద ఇక్కడికి వచ్చావు?" అని అడిగాడు.

"నాయనా, నువ్వు నాకొడుకువు. రాధ కొడుకువు కావు, సూతకులం వాడివికావు. నా మాట నమ్ము. నువ్వు నీ తమ్ములను ఎరగక, దుర్యోధనుడి కోసం మహాపాపానికి ఒడిగట్టటం అనుచితం. అర్జునుడు స్వశక్తితో గెలుచుకున్న రాజ్యాల్ని కౌరవులు అపహరించారు. నువ్వు దానిని ధృతరాష్ట్రుడి కొడుకుల నుంచి తీసుకుని నువ్వే ఏలుకో. బలరాముడూ, కృష్ణుడూలాగ నువ్వూ, అర్జునుడూ ప్రేమగా అన్నదమ్ములై ఉండండి. మీరిద్దరూ ఏకమైతే మీకు

అసాధ్యం ఏమీ ఉండదు," అన్నది కుంతి. ఈ మాటలు విని కర్ణుడు ఏ మాత్రమూ చలించక, కుంతితో ఇలా అన్నాడు:

"అమ్మా, నీమాటలు నేను వినను. నువ్వు నాకు మహాపాపం చేశావు. ఏ శత్రువూ నాకు అంతకన్న పాపం చెయ్యలేదు. పుట్టగానే నన్ను పారేశావు. నేను క్షత్రియుడుగా పుట్టినా సూతుడుగా పెరిగాను. నాకు క్షత్రియ సంస్కారాలు ఏవీ జరగలేదు. ఇన్నాళ్ళూ నాక్షేమం నీకు పట్టలేదు. ఇప్పుడు నువ్వు నీ మంచికోరి నాకు హితం చెబుతున్నావు. నేనిప్పుడు పాండవుల పక్షం అయితే, భయపడి వాళ్ళ అండన చేరానని లోకం అనుకుంటుంది. యుద్ధం జరగబోతూ ఉండగా నేను పాండవులకు అన్ననని ప్రకటిస్తే రాజులంతా నన్ను దుమ్మెత్తి పొయ్యరా? ధృతరాష్ట్రుడి కొడుకులు నన్ను ఎంతో ఆదరించి, సత్కరించారు. ఆ సత్కారాలన్నీ వ్యర్థపుచ్చనా? నామీద ఆధారపడి వాళ్ళు యుద్ధానికి సిద్ధమయ్యారు. నేను వారి ఋణం తీర్చుకోవటానికి ప్రాణాలైనా అర్పించాలి. దుర్యోధనాదుల కోసం నేనూ, నాకొడుకులూ ప్రాణం ఉన్నంత దాకా పోరాడతాం. అయినా నువ్వు నీ కొడుకులను గురించి భయపడి వచ్చావు గనక నిన్ను నిరాశ చెయ్యను. నీకొడుకులందరినీ నేను చంపను. ఒక్క అర్జునుడు మినహాగా, మిగిలిన పాండవులెవరి ప్రాణాలూ తీయను. అర్జునుణ్ణి చంపితేనే గాని నా బలపరాక్రమాలు సార్థకం కావు. యుద్ధంలో అర్జునుడు చచ్చినా, నాతో కలిసి



అయిదుగురుకొడుకులు నీకుంటారు. నేనే చచ్చినా నీకు అయిదుగురు కొడుకులుంటారు. నీకు ఆరుగురు కొడుకులు ఏ పరిస్థితిలోనూ ఉండరు. నువ్వు నిశ్చింతగా ఉండు".

కుంతి దుఃఖావేశంతో కర్ణుణ్ణి కౌగలించుకుని, "నాయనా, ఇది విధి విలాసం. కౌరవులు నాశనం కాక తప్పదు. నీ తమ్ములు నలుగురికి అభయం ఇచ్చినమాట మరవకు. నీకు శుభంకలుగుగాక!" అని దీవించింది. కర్ణుడు ఆమె పాదాలకు నమస్కారం చేసి తన ఇంటికి వెళ్ళాడు. కుంతి తన మందిరానికి తిరిగి వచ్చింది.

కృష్ణుడు ఉపప్లావ్యం చేరుతూనే పాండవులకు జరిగినదంతా చెప్పాడు. అతను చాలాసేపు వారితో మంత్రాలోచన చేసి తనవిడిదికి వెళ్ళి విశ్రాంతి తీసుకున్నాడు.

ఆ రాత్రి పంచపాండవులు కృష్ణుడితో సహా యుద్ధసన్నాహం గురించి చర్చించారు. పాండవుల పక్షాన పోరాటానికి ఏడు అక్షౌహిణుల సేన సిద్ధంగా ఉన్నది. ఒక్కొక్క అక్షౌహిణికీ ఒక్కొక్క నాయకుడు నియమించబడ్డాడు. ఆ ఏడుగురు అక్షౌహిణీ నాయకులూ ఎవరంటే: విరాటుడూ, ద్రుపదుడూ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, సాత్యకీ, చేకితానుడూ, భీముడూనూ. ఈ ఏడుగురి మీదా ఒక మహా నాయకుడుండాలి. అతను భీష్ముడికి దీటైన వాడుగా ఉండాలి. అలాంటి వాడుఎవడని ధర్మరాజు తన తమ్ములను అడిగితే, సహదేవుడు విరాటుణ్ణీ, నకులుడు ద్రుపదుణ్ణీ, అర్జునుడు ధృష్టద్యుమ్నుణ్ణీ, భీముడు, శిఖండినీ సూచించారు. ఏ ఇద్దరూ ఒక విధంగా చెప్పకపోవటంతో ధర్మరాజు కృష్ణుడి అభిప్రాయం ప్రకారం సర్వసేనానిని నిర్ణయింతామన్నాడు. కృష్ణుడు ధృష్టద్యుమ్నుణ్ణే సూచించాడు.

పాండవ బలాలకు ధృష్టద్యుమ్నుడు సర్వసేనానిగా నిర్ణయించబడినట్టు తెలిసి రాజులందరూ సంతోషించారు. ఆర్భాటంగా సైనికసన్నాహం ఆరంభమయింది. రథాలు నడిచాయి. శంఖాలూ, దుందుభులూ మోగాయి. పాండవుల బలాలు మహా సముద్రంలాగా కదిలాయి. సేనకు ముందు భీమ, నకుల, సహదేవులు వెళ్ళారు. వాళ్ళ వెనకగా అభిమన్యుడూ, ఉపపాండవులూ, ధృష్టద్యుమ్నుడూ, ఇతర పాంచాల యోధులూకదిలారు. సేనమధ్యలో ధర్మరాజున్నాడు. సైన్యం వెంట రకరకాల వాహనాలూ, యంత్రాయుధాలూ, వైద్యులూ, పరిచారకులూ ఉన్నారు. ద్రౌపది తన దాసదాసీ జనంతో సహా ఉపప్లావ్యంలోనే ఉండిపోయింది.

పాండవులు సేనలతో బయలుదేరే ముందు బ్రాహ్మణులకు గోవులూ, బంగారమూ దానం చేసి, వారి ఆశీర్వాదాలు పొందారు.

సేన వెనకభాగంలో విరాటుడూ, కుంతిభోజుడూ, ధృష్టద్యుమ్నుడి కొడుకులూ, నలభైవేల రథాలూ, రెండు లక్షల గుర్రాలూ, అయిదు లక్షల కాల్బలమూ, అరవైవేల ఏనుగులూ వెంటబెట్టుకుని చేకితానుడూ, ధృష్టకేతుడూ, సాత్యకీ, కృష్ణుడూ అర్జునుడూ కదిలారు.

ఈ మహాసేన కురుక్షేత్రం చేరగానే శంఖాలు మోగాయి. సైనికులు పరమానంద భరితులై, దిక్కులు పిక్కటిల్లేటట్టు సింహనాదాలు చేశారు.






# సరిఅయిన తీర్పు

పూర్వం గౌతమీతీరాన ధనగుప్తుడనే కటిక పేదవాడుండేవాడు. తన పేరు బొత్తిగా నిరర్థకమయినందుకు అతను ఎంతో బాధపడేవాడు. ధనం సంపాదించటానికి అతను చేసిన ప్రయత్నం ఒక్కటీ ఫలించ లేదు. చివరకు అతను జీవితం మీద విరక్తి చెంది, ఈ జన్మకిక ఇంతే అనుకుని, ఒక నాడు నదిలోకి దూకేశాడు.

ఆ సమయానికి అటుగా పోతున్న గోసాయి ఒకడు ధనగుప్తుణ్ణి నది నుంచి బయటికి లాగి కాపాడి, "ఎందుకు చావా లనుకున్నావు?" అని అడిగాడు.

ధనగుప్తుడు తన సంగతంతా చెప్పాడు. గోసాయి అతనికి ఒక తాయెత్తు ఇచ్చి, "దీన్ని కట్టుకున్నావంటే నీకు అదృష్టం కలిసివస్తుంది. త్వరలోనే ధనవంతుడివవు తావు," అని చెప్పి తన దారిన తాను వెళ్ళి పోయాడు.

గోసాయి యిచ్చిన తాయెత్తు ప్రభావమో, లేక ధనగుప్తుడిలో కలిగిన ఆత్మవిశ్వాసమో గాని, అదిమొదలు అతను చేసిన ప్రతి పనీ కలిసి వచ్చింది. అతను పట్టినది బంగారమయింది. కొద్దికాలంలోనే అతను గ్రామంలోని ధనవంతులలో ఒకడై, ఒక చక్కని కన్యను కూడా పెళ్ళాడి, కాల క్రమాన ఒక కొడుకును కన్నాడు.

క్రమంగా అతను భారీఎత్తున వ్యాపారం ప్రారంభించి అంతులేని పొలాలూ, గొడ్లూ, ఇళ్ళూ, వస్తువాహనాలూ సంపాదించాడు. అతని ఆస్తిపాస్తులను కాపాడుకుంటూ వ్యవహారాలన్నీ సక్రమంగా నడిచేలా చూడ టానికి ఒక దివానును కూడా ఏర్పాటు చేసుకున్నాడు.

కొంతకాలం గడిచాక ధనగుప్తుడి భార్య మరణించింది. తరవాత ధనగుప్తుడు కూడా మంచానపడ్డాడు. తనకు చావు

దగ్గిరపడిందనీ, పసివాడైన కొడుక్కు ఇక దిక్కెవ్వరూ ఉండరనీ తోచి, తీవ్రంగా ఆలోచించాడు. అతను నలుగురు పెద్ద లనూ పిలిచి, వారి సమక్షంలోనే మరణ వాఙ్మూలం రాయించాడు. ఆయన అందులో ఇలా ఏర్పాటు చేశాడు:

"నేను మరణించిన అనంతరం మా దివాను నా యావదాస్తికీ రక్షకుడుగా ఉండి, నా కుమారుని అవసరములన్నీ చూడ వలెను. నా కుమారుడు యుక్తవయస్కు డయిన పిదప దివానుగారు నా ఆస్తిలో తనకు ఇష్టమైనంత నా కుమారునకిచ్చి, మిగిలినది తాను ఉంచుకోవలెను."

ఈ వాఙ్మూలం చూసిపెద్దలంతా నిర్ఘాంత పోయారు. దివాను చాలా సంతోషించాడు.

తన యజమానికి మరణకాలమందు మతి పూర్తిగా పోయివుంటుందని ఆయన అనుకున్నాడు.

వాఙ్మూలం రాయించిన అనంతరం ధనగుప్తుడు కన్నుమూశాడు.

ధనగుప్తుడి కొడుక్కు యుక్తవయసు వచ్చినదాకా దివాను ఆ కుర్రవాడికి ఏ లోటూ రాకుండా చూశాడు.

ధనగుప్తుడి కొడుకు యుక్తవయస్కుడు కాగానే తన ఆస్తిని తనకు స్వాధీనం చెయ్య మని దివానును అడిగాడు.

దివాను అతనికి ఒక తాయెత్తు ఇచ్చి, "దీనితోనే మీ తండ్రిగారు ఇంత ఐశ్వ ర్యమూ సంపాదించుకున్నారు. మీ తండ్రి గారి ఆస్తినుంచి దీనిని నువ్వు తీసుకో. మిగిలినదంతా నాదే," అన్నాడు.




ధనగుప్తుడి కొడుకు నిర్ఘాంతపోయి, "ఇదేమి అన్యాయం? నా తండ్రి ఆస్తి అంతా మీరు తీసుకోవటమేమిటి?" అని అడిగాడు.

"తన ఆస్తిలో నుంచి నా కిష్టమైనంత నేను పుచ్చుకునేటందుకు అనుకూలంగా మీ తండ్రిగారు మరణవాఙ్మూలం తయారు చేశారు. కావలిస్తే నువ్వే ఆ వాఙ్మూలం చదివి చూసుకోవచ్చు," అన్నాడు దివాను.

ధనగుప్తుడికొడుకు తన తండ్రి వాఙ్మూలం తీసుకుని అప్పటికప్పుడే న్యాయాధికారి వద్దకు వెళ్ళి, "ఈ వాఙ్మూలం అడ్డం పెట్టుకుని మా దివాను మా తండ్రి ఆస్తి యావత్తూ కాజేస్తానంటున్నాడు," అన్నాడు.

న్యాయాధికారి వాఙ్మూలాన్ని శ్రద్ధగా చదివి దివానును పిలిపించి, "ఏమయ్యా,



హంతకుడికీ, తాగుబోతుకూ, దొంగకూ, మాటతప్పినవాడికీ పండితులు ప్రాయశ్చిత్తం సూచించారు. అయితే, చేసినమేలు మరచినవాడికి ప్రాయశ్చిత్తమే లేదు! —పంచతంత్రం

ఈ కుర్రవాడు యుక్తవయస్కుడయ్యాడు. తన తండ్రి ఆస్తి తనకిప్పించమంటున్నాడు. అందులో చిక్కేముంది? నా దాకా రాకుండా నువ్వే ఇచ్చెయ్యలేక పోయావా?" అని అడిగాడు.

"చిత్తం, నేను ఇవ్వననలేదండి. మా యజమానికి ఇంత ఐశ్వర్యమూ సంపాదించి పెట్టిన తాయెత్తు అతన్ని తీసుకోమన్నానండి. మిగిలిన ఆస్తి అంతా నేనే ఉంచుకుంటున్నానండి. నా యిష్టం వచ్చినంత నేను ఉంచుకోవచ్చునని మా యజమాని వాజ్మూలంలో స్పష్టంగా ఉందండి," అన్నాడు దివాను.

"అంటే, ఆ తాయెత్తు తప్ప మిగతా ఆస్తి అంతా నీకిష్టమేనా?" అని న్యాయాధికారి అడిగాడు.

"చిత్తం! అదేగదండి నేను తమకు మనవి చేసుకుంటున్నది?" అన్నాడు దివాను ఉత్సాహంగా.

"అలా అయితే ఆ తాయత్తే నువ్వు తీసుకుని, మీ యజమాని ఆస్తి అంతా ఈ కుర్రవాడి పరం చెయ్యి. నీ కిష్టమైనది ఈ కుర్రవాడిపరం చెయ్యమనే ఈ వాజ్మూలంలో ఉన్నది; నీ కిష్టమైనది నువ్వు ఉంచేసుకోవాలని ఇందులో ఎక్కడా లేదు!" అన్నాడు న్యాయాధికారి.

దివాను తెల్లముఖంవేసి ధనగుప్తుడి వాజ్మూలాన్ని మళ్ళీచదివి, న్యాయాధికారి అన్నది నిజమేననీ, తన ఆటకట్టిందనీ గ్రహించి, ధనగుప్తుడి ఆస్తి అంతా ఆయన కొడుకు పరం చేసి, ముఖంచెల్లక మరో గ్రామానికి వెళ్ళిపోయాడు.





# అడవిలో తోడు

పసివాడైన గోపాలుడి తల్లి పేద వితంతువు. భర్త వదిలి వెళ్ళిన ఇంటిచుట్టూ వున్న కొద్ది పాటి నేలలో కూరగాయలు పండించు కుంటూ; రాట్నంలో నూలు వడుకుతూ, వాటిద్వారా వచ్చే చాలీచాలని ఆదాయంతో ఆమె కుటుంబాన్ని నడుపుతూ ఉండేది.

ఆమెకు జీవితంలో రెండే రెండు కోరికలు: ఒకటి దేవుడైన శ్రీకృష్ణుణ్ణి ఎల్లప్పుడూప్రార్థించడం;రెండు-తనకొడుకైన గోపాలుణ్ణి పెంచి ప్రయోజకుణ్ణి చేయడం. ఆమెకు శ్రీకృష్ణుడి మీద అపారమైన భక్తి, అచంచలమైన విశ్వాసం ఉండేవి. కృష్ణుణ్ణి కూడా కన్నబిడ్డలాగే భావించి అమిత వాత్సల్యంతో అన్న పానాదులు అందించేది; జోలపాడి నిద్ర పుచ్చేది!

గోపాలుడికి బడికి వెళ్ళే ప్రాయం వచ్చింది. తన కొడుకు ఎప్పుడెప్పుడు చదవడం నేర్చుకుని, తనకు రామాయణ మహాభారతాలు చదివి వినిపిస్తాడా అని ఆమె కలలుగనసాగింది. అయితే, గోపాలు డికి వేరొక సమస్య ఎదురయింది. వాళ్ళ ఇంటికీ, గురుకుల పాఠశాలకూ మధ్య చిట్టడవి ఉన్నది. బడికి వెళ్ళాలంటే ఆ చిట్టడవిగుండానే నడిచి వెళ్ళాలి. అడవి గుండా ఒంటరిగా వెళ్ళిరావాలంటే గోపాలు డికి భయం పట్టుకున్నది. దానిని గమనిం చిన వాడి తల్లి, "నాయనా! అడవిలో నీకొక అన్నయ్య ఉన్నాడు. అతని పేరు కూడా గోపాలుడే. నీకు భయంగా ఉన్న ప్పుడు "అన్నయ్యా!" అని గట్టిగా గొంతెత్తి పిలువు. తప్పకుండా నీకు తోడువస్తాడు. భయపడకు!" అన్నది.

"అలాగా! ఆవిషయం నాకు తెలియనే తెలియదే! అయినా అడవిలో అన్నయ్య ఒంటరిగా ఏంచేస్తాడు?" అని అడిగాడు గోపాలుడు అమాయకంగా.

"గోవులు కాస్తూ, వేణుగానం చేస్తూ ఉంటాడు," అన్నది తల్లి. మరునాడు గోపాలుడు అడవిగుండా వెళుతూ, వేణు గానం వినిపిస్తుందా అని గమనిస్తూ నడవ సాగాడు. ఎక్కడో దూరంగా పిల్లనగ్రోవి వాయించడం లీలగా వాడి చెవిన పడింది.



మెల్లమెల్లగా అది చేరువవుతున్నట్టు సంగీతం ఎక్కువయింది. మైమరపించే అంత అద్భుతమైన వేణునాదాన్ని వాడె ప్పుడూ వినలేదు.

"ఓ గోపాలన్నయ్యా! నేను నీ తమ్ముణ్ణి. నా పేరూ గోపాలుడే! అడవిలో ఒంటరిగా వెళ్ళడం భయంగావుంది. తోడుగా రావూ!" అని బిగ్గరగా అరిచాడు గోపాలుడు.

మరుక్షణమే వాడి పక్కన చేతిలో పిల్లనగ్రోవితో నవ్వుతూ, గోపాలుడి కన్నా, వయస్సులో కొద్దిగా పెద్దవాడైన కుర్రవాడు కనిపించాడు. గోపాలుడు ఆనందంగా కబుర్లు చెప్పుకుంటూ అతని వెంటనడిచి అడవిని దాటాడు. అప్పుడు పెద్దగోపాలుడు "ఒక మాట చెబుతాను వింటావా?" అని గోపాలుణ్ణి అడిగాడు.

"చెప్పు," అన్నాడు గోపాలుడు.

"నాకు ఏవేవో పనులుంటాయి కదా? అందువల్ల మాటిమాటికీ పిలవవద్దు. నిజంగానీకు భయంవేసినప్పుడు మాత్రమే పిలువు, సరేనా?" అన్నాడు పెద్దగోపాలుడు.

"అలాగే! నువ్వు ఇక్కడే ఉన్నట్టు తెలిసిపోయింది కదా? ఇక నాకేం భయం? నిన్ను తలుచుకుంటూ వెళతానుగా," అన్నాడు గోపాలుడు.

"అదే మంచిది!" అన్నాడు పెద్ద గోపాలుడు.

"అడవి దాటడానికి, నాకేం భయం లేదు. అయినా అడపాదడపా వస్తే ఇద్దరం కలిసి ఆడుకోవచ్చు కదా?" అన్నాడు గోపాలుడు.

"అలాగే! ఆటలంటే నాకూ ఇష్టమే, వస్తాను," అంటూ అడవిలోకి వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

ఇంటికి చేరగానే అడవిలో కలుసుకున్న అన్నయ్యను గురించి గోపాలుడు తల్లికి చెప్పాడు. ఆమాట వినగానే దేవుడిపట్ల కృతజ్ఞతతో ఆమె కళ్ళనిండా ఆనంద బాష్పాలు పెల్లుబికాయి.

మాట ఇచ్చినట్టే అడవిలోని పెద్దగోపా లుడు పిలిచినప్పుడు వచ్చి గోపాలుడితో ఆడుకునేవాడు. కొన్నిరోజులు గడిచాయి.

గురుకులంలో గురువు, చనిపోయిన తండ్రికి యేటా సంవత్సరీకం పెట్టేవాడు. ఆ సందర్భంగా పిల్లలందరూ గురువుకు తమ చేతనైన సాయం అందజేయడం ఆనవాయితీ. ఆ సంవత్సరం కూడా ఆ సందర్భం వచ్చింది. గురువుకు ఇవ్వడా నికి తన ఇంట ఏమీ లేదని గోపాలుడికి

తెలుసు. కాబట్టి ఆ సంగతి తల్లికి చెప్పి, ఆమె మనసు నొప్పించడం ఇష్టంలేక గోపాలుడు ఊరుకున్నాడు. అయినా, ఒట్టి చేతులతో గురువును చూడడం ఎలాగా అన్న విచారంతో గురుకులంకేసి నడవసాగాడు.

అప్పుడు అడవిలోని పెద్దగోపాలుడు కనిపించి, "ఎందుకలా విచారంగా ఉన్నావు?" అని అడిగాడు.

గోపాలుడు తన సమస్యను చెప్పాడు.

పెద్దగోపాలుడు, "అంతేనా? నాదగ్గర కడివెడు పాలున్నవి. తీసుకువెళ్ళి మీ గురువుగారికి ఇవ్వు," అంటూ పొదల చాటునుంచి ఒక చిన్న కడవను తెచ్చి, గోపాలుడి చేతికిచ్చి వెళ్ళిపోయాడు.



గోపాలుడు ఆనందంతో పాలకడవతో గురుకులంకేసి నడిచాడు.

తోటి విద్యార్థులందరూ బియ్యం, పప్పు, బెల్లం, పళ్ళు, డబ్బు అంటూ గురువుకు తెచ్చి ఇచ్చారు. ఆఖరికి గోపాలుడి వంతు వచ్చింది. వాడు సిగ్గుతో తలవంచుకుని, పాలకడవను గురువు చేతిలో పెట్టి పక్కకు తప్పుకున్నాడు. కడవను తీసుకున్న గురువు పాలను పెద్ద పాత్రలోకి పోశాడు. ఆ పాత్ర నిండింది. అయితే, చేతిలోని కడవపాలు అలాగే ఉన్నాయి!

పాలను ఇంకొక పెద్ద కుండలోకి వంపాడు.ఆకుండకూడా పాలతో నిండింది. కాని, గోపాలుడిచ్చిన కడవలో మాత్రం పాలు గరిటెడు కూడా తగ్గలేదు. ఆ అద్భుతాన్ని చూసిన గురువుకు విస్మయం తోసొమ్మసిల్లినంత పనయింది. అతి కష్టంమీద నిలదొక్కుకుని, కడవను తీసుకు పోయి లోపలి గదిలో భద్రంగావుంచి, గోపాలుణ్ణి పిలిచి, "ఆ పాలు ఎక్కడి నుంచి తెచ్చావు?" అని అడిగాడు.

గోపాలుడు తనకు అడవిలో తోడుగా వున్న అన్నయ్యను గురించి వివరంగా చెప్పాడు.

అంతావిన్న గురువు, "అలాగా! ఇప్పుడే నన్ను అక్కడికి తీసుకుపో నాయనా!" అంటూగోపాలుడి వెంట బయలుదేరాడు.

ఇద్దరూ అడవి చేరుకున్నాక, గోపాలుడు బిగ్గరగా గొంతెత్తి, "అన్నయ్యా" అని పిలిచాడు. అయినా అతడు రాలేదు. మళ్ళీ మళ్ళీ పిలిచాడు. కోపంతో అరిచాడు.



యౌవనంలో కోరికలు, ఆవేశం అదుపుచేయగల వారిని మాత్రమే ప్రశాంత చిత్తులుగా నేను భావిస్తాను. శక్తి యుక్తులు ఉడిగే ప్రాయంలో (అంటే, ముసలితనంలో) ఎవరు మాత్రం ప్రశాంత చిత్తులుగా నడుచుకోరు? — పంచతంత్రం

అయినా ప్రయోజనం లేకపోయింది. చాలా సేపు గడిచి పోయింది.

ఆఖరికి వాడు, "అన్నయ్యా! నువ్విప్పుడు రాలేదంటే, ఇకపై నీతో ఎప్పుడూ ఆడుకో డానికి రాను. తెలుసుకో!" అన్నాడు ఏడుపు గొంతుతో.

అప్పుడు అడవి నుంచి పెద్దగోపాలుడి కంఠస్వరం వినిపించింది:

"నీలాగే, నాకూ నీతో ఆడుకోవాలని ఆశగావుంది. తప్పేమీ లేకుండా నన్నెం దుకువద్దంటావు? మీ గురువుగారి ఆతృత మంచిదే. అయినా, నన్ను చూడడానికీ, నాతో మాట్లాడడానికీ ఇంకా ఆయనకు సమయంఆసన్నంకాలేదని చెప్పు. ఆయన ఇంకా కొంతకాలంవేచిఉండాలి. ఆయన అందుకు నిజంగానే ఆయత్తమైనప్పుడు, ఆయన దానిని తప్పకుండా సాధించి తీరుతాడు!"

"అన్నయ్య మాటలు విన్నావా! గురు దేవా," అని అడిగాడు గోపాలుడు ఆతృతగా.

"నాకేవీ వినిపించలేదే!" అన్నాడు గురువు.

"గోపాలన్నయ్య మాటలు నాకు స్పష్టంగా వినిపించాయే!" అంటూ తాను విన్న మాటలను గురువుకు చెప్పాడు గోపాలుడు.

గురువు ఆనందంతో కన్నీళ్ళుకారుస్తూ, "చాలు నాయనా, నాకు అది చాలు. నీ ద్వారా నాకొక వరం సిద్ధించింది. పుణ్యా త్మురాలైన నీ తల్లి విశ్వాసం చాలాగొప్పది! నిర్మలమైన నీ ప్రేమ, అసమానమైనది!" అన్నాడు గద్గగ స్వరంతో.



## Statement about Ownership of CHANDAMAMA (Telugu)

Rule 8 (form VI), Newspaper(Central) Rules, 1956

| | |
|---|---|
| 1. Place of Publication | CHANDAMAMA BUILDINGS<br>NSK Salai<br>Chennai-26 |
| 2. Periodicity of Publication | MONTHLY<br>1st of each Calender month |
| 3. Printer's Name<br>Nationality<br>Address | B.VISWANATHA REDDI<br>INDIAN<br>Chandamama Buildings<br>Chennai-26. |
| 4. Publisher's Name<br>Nationality<br>Address | B.VISWANATHA REDDI<br>INDIAN<br>Chandamama Buildings<br>Chennai-26 |
| 5. Editor's Name<br>Nationality<br>Address | B.VISWANATHA REDDI<br>INDIAN<br>Chandamama Buildings<br>Chennai-26 |
| 6. Name and Address of individuals who own the paper | Chandamama India Ltd.,<br>Board of Directors:<br>1. Vinod Sethi<br>2. B. Viswanatha Reddi<br>3. P. Sudhir Rao |

*I, **B. Viswanatha Reddi,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.*

1st March 2000

**B. VISWANATHA REDDI**

*Signature of the Publisher*



# భారతదేశం

నాడు-నేడు



# ముంబాయి

ఒకప్పుడు విడివిడిగా వున్న ఏడు దీవులను ఈనాడు చూడలేము. అన్నీ కలిసి బ్రహ్మాండమైన బొంబాయి నగరంగా రూపొంది ఉన్నాయి. నగర అధిదేవత ముంబాదేవి (ముంబా బాయి) పేరు మీదుగా దీనికి బొంబాయి అనే పేరు వచ్చింది. అధిదేవత అసలు పేరు అంబాభవాని. ఇప్పుడు బొంబాయి పేరును ముంబాయిగా మార్చారు. ఇది ఆంగ్లేయుల రాకకుపూర్వం ఉన్న పేరుకు దగ్గరగా ఉంది.

ముంబాయి చరిత్ర పదహారవ శతాబ్దం వరకు వెళుతుంది. 1510వ సం॥లో పోర్చుగీసు జనరల్ అల్బుక్వెర్క్ గోవాను జయించాడు. 1534వ సం॥లో ఆనాటి ప్రినా ఉర్బిస్ (అందాల నగరం)తో సహా సువిశాల ప్రాంతానికి జమీందారు అయ్యాడు.

ఆధునిక నగరం అని చెప్పుకునే విధంగా అప్పుడీప్రాంతంలో ఏదీ లేదు. అయితే, చిన్నచిన్న పట్టణాలు, పెద్ద పెద్ద అంగడి వీధులు ఉండేవి. ఎందుకంటే ఇది క్రీస్తు పూర్వం కొన్ని శతాబ్దాల నుంచే అసీరియా. పర్షియా. రోము మొదలైన దేశాలకు చెందిన వర్తకులను ఆకర్షించింది!

అల్బుక్వెర్క్ జమీందారీని పోర్చుగీసులు అంత విలువైనదిగా భావించలేదు. బ్రిటిష్ యువరాజు రెండవ చార్లెస్‌ను పోర్చుగీసు యువరాణి కేథరిన్ డీ బ్రగాన్జా పెళ్ళాడింది. ఆ సందర్భంగా యువరాజుకు కట్నంగా ఈ ప్రాంతాన్ని ఇచ్చారు. ఆ రోజుల్లో ఆ ప్రాంతం ద్వారా వచ్చిన ఆదాయం పది పౌండ్లు మాత్రమే. కింగ్ చార్లెస్ దానిని పది పౌండ్లకు ఈస్ట్ ఇండియా కంపెనీకి లీజుకు ఇచ్చాడు.

ఆనాటికే ఏడు దీవులూ ఒకటిగా చేరడమే కాక, ప్రధాన భూభాగంతో కలగలిసిపోయాయి. అటుపైన అభివృద్ధి అతివేగాన్ని పుంజుకున్నది.

ఒకప్పుడు తన సొంతదారుకు యేటా కేవలం పది పౌండ్లు మాత్రమే ఆర్జించి పెట్టిన ఈనాటి మహారాష్ట్రరాజధాని ముంబాయి, భారతదేశానికి ఆర్థిక రాజధానిగా పరిణమించింది. ముఖ్యమైన అన్ని బ్యాంకుల ప్రధాన కార్యాలయాలూ ఇక్కడే ఉన్నాయి. ఇక్కడే మనదేశంలో అతిపెద్ద స్టాక్





ఎక్స్ఛేంజ్ ఉంది. మన దేశానికి లభించే ఆదాయపు పన్నులో ముప్పై మూడు శాతం ముంబాయి నుంచే లభిస్తున్నది.

1853వ సం॥లో మనదేశంలో మొట్ట మొదటి రైలుబండి బొంబాయి-థాణాకు మధ్యనడిచింది. బొంబాయి నౌకాశ్రయానికే యూరపు నుంచి మొట్ట మొదట ఓడలు వచ్చాయి. ఇవాళ బొంబాయి నగరంలోనే దేశంలోని అతిపెద్ద హార్బరు ఉంటోంది. 1885వ సం॥లో బొంబాయిలోనే భారత జాతీయ కాంగ్రెస్ ప్రథమ సమావేశం జరిగింది. భారత స్వాతంత్ర్య ఉద్యమంలో బొంబాయి ప్రముఖ పాత్ర వహించింది!

ముంబాయి నగర అభివృద్ధికి మహారాష్ట్ర, గుజరాత్, దక్షిణ భారత ప్రజలు ఎంతో పాటు పడ్డారు. తమదేశంపై ఇస్లాంమత ఆధిక్యత పెరగడంతో తమ ప్రాచీన జొరాష్ట్రియన్ మతాన్ని వదులుకోవడం ఇష్టంలేక ఇరాన్ (పర్షియా) నుంచి ఇక్కడికితరలి వచ్చిన పార్సీలు కూడా ఈ నగర అభివృద్ధికి ఎంతో కృషిచేశారు!

ముఖ్యమైన ప్రతి కాలఘట్టమూ, నగరంలో స్మారక చిహ్నాలనూ, భవనాలనూ తన ఆనవాలుగా వదిలి వెళ్ళింది. ఆఫ్ఘన్ చర్చ్, గేట్‌వే ఆఫ్ ఇండియా (భారత దేశ సింహద్వారం), ఛత్రపతి శివాజీ రైల్వే టెర్మినస్ (వెనకటి విక్టోరియా టెర్మినస్), మహాలక్ష్మి ఆలయం మొదలైన బ్రహ్మాండమైన భవనాలను నగరంలోని ప్రధాన చిహ్నాలుగా చెప్పవచ్చు.

బహుశా ప్రపంచం మొత్తం మీద ముంబాయిలోనే అత్యధిక సంఖ్యలో చలన చిత్రాలు నిర్మించబడుతున్నాయి.

నగరంలో యేటా గణేశ చతుర్థి ఉత్సవాలు ఘనంగా జరుగుతాయి.

ఈనాడు ముంబాయి జనాభా తొంభైతొమ్మిది లక్షలు. నగరంలో పరిపాలన, వర్తక వాణిజ్య, విద్యాసాంస్కృతిక సంస్థలు, కార్యాలయాలు నిండి ఉన్నాయి. నగర పరిసర ప్రాంతాలు అసంఖ్యాకమైన చిన్నా పెద్దా పరిశ్రమలతో ఎప్పుడూ నవజీవంతో తొణికిసలాడుతూ ఉంటాయి.

అరేబియా సముద్ర తీరంలోని ముంబాయి నగరం అమిత జనాభా కలిగి ఉన్నప్పటికీ – కంఠహారంటాంటి మెరీన్‌డ్రైవ్‌తో, పచ్చటి మలబార్ హిల్స్‌తో, ప్రపంచంలోని అతిసుందర నగరాలలో ఒకటిగా కొనసాగుతున్నది!



# కనుగొనండి, రాయండి,

ఈ సంచికలో ప్రచురించిన ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో ప్రకటించబడతాయి. అదేసమయంలో మీరు కూడా భారతదర్శనం పోటీకి సమాధానాలు పంపవచ్చు. అయితే, ఎంట్రీలు పంపడానికి మీరు కొంత సృజనాత్మక కృషి చేయాలి. గత సంచికలోని కథలను క్షుణ్ణంగా చదవండి. ఆ కథలలో మీకు బాగా నచ్చిన కథను తెలియజేస్తూ ఆ కథ ఎందుకు మీకు నచ్చింది? అన్న దానిని వివరిస్తూ ఇరవై వాక్యాలకు మించకుండా చిన్న వ్యాసం రాసి, మీ సమాధానాలకు జతచేయాలి. మీ వయస్సు, విద్యార్థి(ని) అయినట్టయితే మీరు చదువుతూన్న తరగతి/విద్యాసంస్థ పేరు; మీ పూర్తి చిరునామా రాసి, సమాధానాల చివర మీరు సంతకం చేయాలి. మీ సంతకాన్ని ధృవపరుస్తూ, మీ ఉపాధ్యాయులు లేదా మీ తల్లితండ్రులలో ఎవరో ఒకరు, సంతకం చేయాలి. సమాధానాలను **భారతదర్శనం పాఠకులకు పోటీ, చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్-600 026** చిరునామాకు పంపాలి.

| | | |
|---|---|---|
| మొదటి బహుమతి | రూ. **1000**/- | ఇంకా ఐదు ప్రోత్సాహక బహుమతులు ఒక్కొక్కటి రూ. **200**/- |
| రెండవ బహుమతి | రూ. **500**/- | |






## భారతదర్శనం పాఠకులకు పోటీ

యువకుడొకడు తనకు ఎదురైన సమస్యను పరిష్కరించుకోవడానికి ఒక ముని దగ్గరికి వెళ్ళి సలహా అడిగాడు. ఆ యువకుడు చెప్పినదంతా ఓర్పుతో విన్న ముని, వెంటనే సమాధానం చెప్పకుండా మౌనంగా ఊరుకున్నాడు.

మునిభార్య కుటీరానికి వెనకవున్న బావినుంచి నీళ్ళు తోడుతున్నది. ముని ఆమెను పేరుపెట్టి పిలవగానే, ఆమె చేదుతూన్న బిందెనూ, చేతాడునూ గిలకపై అలాగే వదిలి భర్త దగ్గరికి వచ్చింది. ఆమె వదిలిన చేతాడు బిందెతో నీళ్ళలో పడి మునిగిపోకుండా వదిలినది వదిలినట్టు అలాగే నిలబడింది. ఎలాంటి ఆధారం లేకుండా అలాగే నిలిచిన దానిని చూసిన యువకుడికి కలిగిన ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. ఆ స్త్రీ భర్త పట్ల అమిత భక్తి శ్రద్ధలు కలిగిన శీలవతి మాత్రమేకాదు; ఆమెకు కొన్ని అద్భుత శక్తులున్నాయని కూడా ఆ యువకుడు గ్రహించాడు. ఆ ముని ఎవరు? ముని భార్య పేరేమిటి?



కింద కనబరచిన పౌరాణిక జంట పాత్రలకూ-దేశాలకూ పరస్పరం సంబంధం ఉన్నది. ఆ సంబంధం ఏమిటో చెప్పగలరా?

విజ్ఞాన వినోదాల మేలు కలయిక,

# బహుమతులు గెలుచుకోండి!

మామ







1. రాజకీయ, దౌత్య, ఆర్థిక శాస్త్రాలకు సంబం, ధించిన మొట్టమొదటి భారతీయ గ్రంథం ఏది? గ్రంథకర్త ఎవరు?
2. మనదేశంలో చరిత్రకు సంబంధించిన మొట్ట మొదటి గ్రంథంగా దేనిని చెబుతారు? గ్రంథకర్త ఎవరు?
3. కాళిదాసుకు పూర్వం ప్రసిద్ధిగాంచిన నాటక కర్త ఎవరు?
4. భారతదేశంలో రాజుగావుండి యోగిగా మారిన సుప్రసిద్ధ కవి ఎవరు? ఆయన రచించిన గ్రంథం ఏది?
5. రామాయణంలో కొంతకాలం తరవాత చేర్చబడిన 'కాండ' గా దేనిని చెబుతారు?




నిబంధనలు :

1. చందమామ ఇండియా లిమిటెడ్ సంస్థలో ఉద్యోగం చేసే వాళ్ళూ/సంబంధించిన వాళ్ళూ, వాళ్ళ బంధువులూ ఈ పోటీలో పాల్గొనకూడదు.
2. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.
3. దస్తూరీ స్పష్టంగా లేని ఎంట్రీలు స్వీకరించబడవు.
4. పోటీ ఫలితాలు చందమామ **జూన్** నెల సంచికలో ప్రకటించబడతాయి.
5. సమాధానాలు మార్చ్ **31**వ తేదీలోగా మాకు చేరాలి.

| | | |
|---|---|---|
| ఎ. ధృతరాష్ట్రుడు | - | గాంధార |
| బి. సావిత్రి | - | సాళ్వ |
| సి. సహదేవుడు | - | మద్రదేశం |
| డి. కర్ణుడు | - | అంగదేశం |
| ఇ. బభ్రువాహనుడు | - | మణిపురి |

ేశ భాషలలో చందమామ ప్రత్యేకత!




## మళ్ళీ ప్రపంచం దృష్టిని ఆకర్షిస్తూన్న

# టిబెట్

ఇటీవలి కాలం వరకు ప్రపంచంలోని పలు విషయాలను భౌతిక బలమే నిర్ణయిస్తూ వచ్చింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం (1939-45) ఆ పరిస్థితిలో మార్పు రావడం ఆరంభమయింది. పరస్పర అవగాహన ద్వారా, మంతనాల ద్వారా రాజకీయ సమస్యలను పరిష్కరించుకోవడం మొదలయింది.

అయినా, భౌతికబలం ఇంకా అక్కడక్కడ కీలక పాత్రవహిస్తున్నది. మన దేశంలో అనేక చిన్న చిన్న సంస్థానాలు ఉండేవని మనకందరికీ తెలిసిందే. అటువంటి సంస్థానాలను వాటి ఇష్టానుసారం భారతదేశంలోగాని, పాకిస్తాన్‌లో గాని కలిసిపోవడానికి అవకాశం కల్పించ బడింది. అప్పుడు వందలాది సంస్థానాధీశుల్లాగే కాశ్మీరు పాలకుడు మహారాజా హరిసింగ్ తన సంస్థానం భారతదేశంలో కలవాలని నిర్ణయించాడు. అయితే పాకిస్తాన్ తనకు ఎలాంటి న్యాయ పరమైన హక్కూ లేకపోయినప్పటికీ, కాశ్మీరులో కొంత భాగాన్ని ఆక్రమించి, తన అధి కారంతో తొక్కిపట్టింది. ఆప్రాంతాన్ని 'ఆక్రమిత కాశ్మీరు' అంటున్నాం!

అదేవిధంగా 20వ శతాబ్దం 5వ దశాబ్దింలో చైనా,టిబెట్‌ను ఆక్రమించసాగింది. భౌగోళికంగా చైనాకు పక్కనే ఉన్నప్పటికీ టిబెట్టుకు ప్రత్యేక సంస్కృతి, సొంత ప్రభుత్వం ఉన్నాయి. దలైలామా బౌద్ధమతాధికారిగానూ, టిబెట్ ప్రభుత్వ నాయకుడిగానూ ఉంటున్నాడు. 14వ దలైలామా టెన్జిన్ గియాట్సో ఇండియాలో ఆశ్రయం పొందాడు. ధర్మశాలలో ప్రవాస జీవితం గడుపుతూ,



అక్కడినుంచి ప్రభుత్వాన్ని నడుపుతున్నాడు.

దలైలామాకు తరవాత, పంచన్ లామా టిబెట్ ప్రజల నాయకుడు. పంచన్ లామా కార్యాలయాన్ని చైనా తన గుప్పిటలోకి తెచ్చుకున్నది. టిబెట్ ప్రజల మూడవ ముఖ్య నాయకుడైన కర్మపా విషయంలోనూ ఇదేవిధంగా చేయడానికి చైనా ప్రయత్నించింది. ప్రస్తుత 17వ కర్మపా అసలు పేరు యుగ్యేన్ ట్రిన్లే డోర్జీ. ఆయన గత జనవరిలో అక్కడి నుంచి భారత దేశానికి తప్పించుకుని వచ్చి ధర్మశాలను చేరాడు.

కర్మపాకు ఇంకా ఇరవైయేళ్ళు కూడా నిండలేదు. టిబెట్‌పై చైనా ఆధిపత్యాన్ని ఆయన సహించలేకపోయివుంటాడు. ఆయన కొందరు అనుచరులతో కలిసి, మంచుతో కప్పబడి, భయంకర గాలులువీచే కనుమల గుండా కొండ మార్గంలో వందల కి.మీ. కాలినడకనే వచ్చాడు.

కొంతకాలం క్రితం దలైలామా 'ది హెరిటేజ్' (చందమామ సంస్థనుంచి 1985-89 మధ్య కాలంలో వెలువడిన ఆంగ్ల పత్రిక)కు ఇచ్చిన ఇంటర్వ్యూలో అక్కడి పరిస్థితులను గురించి వివరించాడు: "సాంస్కృతిక విప్లవం అని చెప్పబడే కాలంలో మతానికీ, సంస్కృతికీ సంబంధించిన అనేక గ్రంథాలను నాశపరిచారు. వ్రాత ప్రతులను చెప్పుల కింద అట్టలుగా ఉపయోగించారు. ఎరువు దిబ్బల గోతులలోకి విసిరి వేశారు."



"ఇప్పుడైనా ఆ ధోరణి మారిందా, లేదా?" అని హెరిటేజ్ అడిగింది. "అవును, ఇప్పుడు మారింది," అన్నారు దలైలామా.

మునుముందు ఇంకా మార్పు రావాలనీ, టిబెట్టుకు కనీసం స్వయంప్రతిపత్తినైనా కల్పించాలనీ, ప్రపంచం ఆశిస్తోంది. దలైలామా, కర్మపా



ఇరువురూ తమరాజధాని లాసాను తిరిగి చేరుకోగలగాలి!

టిబెట్ అతి ఎత్తయిన ప్రదేశంలో ఉండడం వల్ల దీనిని 'ప్రపంచం పైకప్పు'గా చెబుతారు. దాని పల్లపు ప్రాంతాలు సైతం సముద్ర మట్టానికి 4,000 అడుగుల ఎత్తులో ఉన్నాయి. వ్యవసాయమూ, గొర్రెల పెంపకమూ, టిబెటన్ల ప్రధాన వృత్తులు. ఉన్ని, కస్తూరి, బంగారం, గోధుమలు, బార్లీ వ్యాపారాలు కూడా చేస్తారు.

ఒళ్ళంతా పొడవాటి రోమాలతో దున్నలా కనిపించే ఇక్కడి యాక్ జంతువు ఎంతటి చలినైనా తట్టుకోగలుగుతుంది. గనక, అందరూ దాని మీద ఎక్కువగా ఆధారపడతారు. దాదాపు టిబెట్ ప్రజలందరూ బౌద్ధ మతస్థులే. కష్టపడి పనిచేస్తూ, నిరాడంబర జీవితం గడుపుతూ ఉంటారు.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



ఫోటో వ్యాఖ్యల పోటీ
చందమామ
వడపళని
చెన్నయ్-600 026





వ్యాఖ్యలను పోస్టుకార్డుపైన రాసి ఈ నెల 25 వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు మే 2000 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

## అభినందనలు



జనవరి 2000 నెల సంచికలో
బహుమతి పొందిన వ్యాఖ్యలు
పంపినవారు:
సి. ప్రణీత D/o. సి. శ్రీనివాస్
III క్రాస్ రోడ్, రాంజీనగర్, నెల్లూరు.



బహుమతి పొందిన వ్యాఖ్యలు
మొదటి ఫోటో : కదలి సాగితే గమ్యం!
రెండవ ఫోటో : కలసి ఆడితే రమ్యం!!